అయిదవ ప్రచురణ
ప్రథమ ముద్రణ

1000
ప్రతులు

వెల : రు. 1.50 నయాపైసా

అజంతా ప్రింటర్సు
సికింద్రాబాదు

ప్రతులకు :
నవ్య సాహితీ సమితి
208 బోయిగూడ, సికింద్రాబాదు.

# మా మాట

మా సమితి అయిదవ ప్రచురణ కథానికల సంపుటి ఒకటి వెలువరిస్తున్నాం. అఖిలాంధ్రనుండి సమితి సభ్యులైన పన్నెండుగురు రచయితల కథలు ఇందులో సేకరించాం. కథానిక సాహిత్యంలో నేడు ఒక ప్రత్యేకస్థానం ఆక్రమించుకుంది. కాలం గమనంలో నూత్న దృక్పథాలతో క్రొత్త యితివృత్తాలు సేకరిస్తూ అనేక రచయితలు ముందుకు వస్తున్నారు. ఈ సంపుటిలోని కథలుకూడ పాఠకలోకానికి ఆదరపాత్రమవుతాయని ఆశిస్తున్నాం.

మా సమితి ఇంతవరకు సాహిత్యరంగంలో చేసిన కృషి సర్వజన విదితం. సాహితీవేత్తలు, రచయితలు, ద్విగుణీకృతమయిన సహకారమిస్తూ సమితి కృషికి భవిష్యత్తులో కూడ తోడ్పడ గలరని ఆశిస్తున్నాం.

| | | |
|---|---|---|
| హైదరాబాదు | అధ్యక్షుడు : | కార్యదర్శులు : |
| 1 మే 1957 | కురుగంటి సీతారామయ్య | పోతుకూచి సాంబశివరావు |
| | | ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి |

# ఇందులో........

మంజుశ్రీ

దివ్యా ప్రభాకర్

ఇనుకపల్లి దక్షిణామూర్తి

కంచి వాసుదేవరావు

కె. వీరభద్రశాస్త్రి

అభిమన్యు

ఐసోలా

టి. వి. రత్నావళి

కందుకూరి లింగరాజు

తురగా కృష్ణమోహనరావు

యం. జానకీరాణి

ఉషశ్రీ

# మంజుశ్రీ

వీరి వయస్సు 21 సంవత్సరాలు. వీరి పూర్తి పేరు అక్కిరాజు రమాపతిరావు. స్వగ్రామము నరసరావుపేట.

వీరు రచించిన "జీవితవలయాలు" "జారుడు మెట్లు" అన్ననవలలు తెలుగు స్వతంత్రలో ప్రచురించబడినవి. ఇవి త్వరలో పుస్తకరూపంలో రానున్నవి. వీరి కథలు "జ్యోతి" "స్వతంత్ర" మున్నగు పత్రికలద్వారా పాఠకులకు పరిచితములు.

ప్రస్తుతం వీరి కార్యక్రమం విద్యార్జన, విజ్ఞానార్జన.

కథల్లో మనుష్యులను జీవితంలో చూడాలని వీరి ఉత్కంఠ. సాంకేతిక దృక్పథం రచనల్లో యిమిడ్చి పాఠకుని ఆలోచనాశక్తికి వీరి కలం బాగా పనికల్పిస్తుంది.

# పార్కులో పచ్చపూలు

హటాత్తుగా అతణ్ణి చూసేప్పటికి పరమేశం నమ్మలేక పోయినాడు. తనను తాను నమ్మించుకునేప్పటికి తాతలు దిగొచ్చారు. అతనికి తెలిసినంతవరకు రమణమూర్తికి సిగరెట్ తాగే అలవాటులేదు. పార్కులో ఆమూల సిమెంటు బెంచి మీద కూచుని సిగరెట్ తాగుతున్న మనిషి రమణా, కాదా అని అతడికి అనుమానం కలిగింది. పైన మొహమంతా వికృతంగా వుంది. గుడ్డలు మాసిపోయినయ్. గెడ్డంకూడా పెరిగి వుంది.

పరకాయించి చూశాడు పరమేశం. అతడికి దృఢమైన నమ్మకం కలిగింది. దగ్గరగా వెళ్ళాడు. అతడేం చలించలేదు. తన్మయత ననుభవిస్తూ సిగరెట్ పీకుతున్నాడు. పరమేశం మనసు గట్టిపరచుకుని పిలిచాడు 'రమణా' అని.

అతడు తలపైకెత్తి చూశాడు.

అతడి బుజంమీద చెయ్యేశాడు.

"ఇక్కడే వుంటున్నావా?" అని అడిగాడు.

రమణమూర్తి తలతిప్పాడు.

"కాఫీకి వెళ్దాం దా" అని పిలిచాడు పరమేశం.

తల్లి ననుసరిస్తున్న లేగదూడలా వెంటపడ్డాడు రమణమూర్తి. కాఫీతాగి బయటకొచ్చిన తర్వాత "మా ఇంటికిరా, రమణా" అన్నాడు పరమేశం.

"నువ్విక్కడే వుంటావేమిటి?" చాలా సేపటికి యోగ క్షేమాలు కనుక్కోటం మొదలెట్టాడు రమణమూర్తి.

పరమేశం తలవంచుకుని "నా గ్రూపింకా పూర్తికాలేదు. మా పెదనాన్నగారింట్లో వుండి చదువు కుంటున్నాను. మా పెత్తల్లిపోయి ఆర్నెల్లైంది" అన్నాడు.

రమణమూర్తి మరేం మాట్లాడలేదు. 'ఇవాళ రాను' అన్నాడు. "మాఇల్లు ఎంతో దూరంలేదు" బ్రతిమాలుతున్న ధోరణిలో పరమేశం అన్నాడు.

"రేపు పార్కులో కలుసుకో. నేనెప్పుడూ పార్కులోనే వుంటుంటాను. రేపువస్తాను" అన్నాడు.

రమణమూర్తికి తననుచూసి తనకే జాలేసింది. ప్రపంచాన్ని రోసినా సభ్యత అనేది వొకటుందిగా. ఇలా వాళ్ళింటికి పోతే వాళ్ళేమనుకుంటారు? అనుకున్నాడు.

పరమేశం ఇంటి కెళ్ళిపోయాడు.

రమ అన్నం వడ్డిస్తుంటే పరమేశం ఎలా మొదలెట్టాలా, అని ఆలోచిస్తున్నాడు. పరమేశంలాంటి మనుషులకు హృదయంలో ఏవిషయమూ దాగదు. ఆ విషయంకాస్త బయట పడవేస్తేకాని ఆత్మ తృప్తిపడదు. ఎదుటివాళ్ళ ముఖంలో మార్పులు వస్తున్నాయా? లేదా? వాళ్ళు సానుభూతి నెలా వ్యక్తంచేస్తారు ? ఇవన్నీ చూడాలని వొకటే వ్యర్థ కుతూహలం.

"ఇవాళ నా స్నేహితుడొకడు కనిపించాడు." పరమేశం అన్నాడు రమకు వినపడాలని. రమ విని వూరుకుంది. పరమేశం

అలా వూహించక పోవటంతో "పాపం! దురదృష్టవంతుడు" అన్నాడు.

రమ ఈసారి పరమేశం ముఖంలోకి తీక్ష్ణంగా చూచింది. పరమేశం ఏదో చెప్పబోయినాడు.

"నీకు పుణ్యముంటుం దన్నయ్యా, నా కాక లౌతున్నది. నువ్వు త్వరగా తినిలే. నేనూ చప్పున తినివస్తాను. వెన్నెల్లో కూచుని నువుచెప్పిన కథ వింటాను" అన్నది రమ.

పరమేశానికి చాలా ఉత్సాహం కలిగింది కాని, అది కేవలం, తాత్కాలికంగా రూపొందింది. వెన్నెల్లో కూచుని కబుర్లాడుకునే యోగ్యత తనకులేదు. పెదనాన్న తప్పకుండా చీవాట్లు పెడతాడు. రమ కావిషయం తెలుసు. తెలియకనా? తనుచెప్పేది వినటం ఇష్టంలేక అలా తప్పించుకోవా లనుకుంటున్నది. పరమేశాని కదెంతమాత్రం ఇష్టంలేదు.

"ఎక్కువ కంథేలేదు రమా, అతడిపేరు రమణమూర్తి" అన్నాడు.

రమ విసుక్కుంది. అలా విసుక్కుంటానని తెలియచెప్పటానికి అన్నం ఎక్కువ వడ్డించింది. ఇద్దరి కూర తెచ్చి కుమ్మరించింది. పరమేశం అవేమి చూడటంలేదు. "వాళ్ళన్నయ్యకీ వూళ్ళోనే వుద్యోగం. రెండొందలొస్తాయట. ఎలా మారిపోయాడు? ఘోరంగావుంది వాడి స్థితి."

"ఏమిటి? ఎందుకనీ? ఆయన చదువుకోటంలేదా? లేక ఏదయినా పరీక్ష తప్పాడా?" రమ కొద్దిగా నవ్వింది. పరమేశం ముఖం ఎఱ్ఱగా చేసికొని "ఏదేవరే నన్నేం ఎత్తిపొడవాల్సిన

అవసగంలేదు. ఇంత విశాలమయిన ప్రపంచంలో అంతా అదృష్ట వంతులే వుంటారా ? అలా ఐతే యేడ్చేవాళ్ళెవరుంటారు?" రమ కొద్దిగా బాధపడి "ఐతే రమణమూర్తిగారి సంగతేమి టన్నయ్యా చెప్పవూ" అంది. పరమేశం అంతా మర్చిపొయ్యాడు.

"పాపం వాడిభార్య పోయింది. అప్పటినుంచీ వాడి ఆనందము పోయింది" అన్నాడు.

రమ ఉత్సుకతో "అలానా, అలానా. ఏం జరిగిందన్నయ్యా అన్నది.

"ఏంలేదు రమా. మేమిద్దరమూ, స్కూలుఫైనల్ చదువు తుండగా వాడి పెళ్ళయింది. వాళ్ళమ్మ పట్టుపట్టి పెళ్ళి చేయించింది. అయినవాళ్ళ సంబంధమట."

"అయితే..."

"ఇంటర్ కాగానే కాపరాని కొచ్చిందా అమ్మాయి." రమ కళ్లు కిందకు దించేసుకుంది.

"వాడు ఆ అమ్మాయిని ఎంత ప్రేమించేవాడో చెప్పలేము."

రమ తళుక్కున నవ్వింది. "సరే పోనీలె, పోనీలే, ఇప్పుడేం చెప్పనవసరంలేదు" అంది.

పరమేశానికి ఎవరిముందు ఎలా మాట్లాడాలో తెలియదు. పదిహేడేళ్ళ చెల్లెలిముందు ప్రేమగురించి చర్చిస్తాడు.

"ఏం, ఎందుకనీ, అంతగా పెళ్ళాన్ని ప్రేమించినవాణ్ణి నేను చూడలేదు." పరమేశం, తనెంతో అనుభవం కలవాడిగా వయసుతో పండిపోయినవాడుగా మాట్లాడుతున్నాడు.

రమ నవ్వుకుంది. "నువ్వెన్ని కాపరాలు చూశావు!" అంది.

"చూడాలా యేం? రమణకున్న హృదయం అందరికీ వుండదు. ఆ సంగతి నాకు బాగా తెలుసు,"

"ఎందుకనీ..."

"నే నొక్క విషయం చెపుతాను. వాడా అమ్మాయిని ఎంత ప్రేమించిందీ తెలుస్తుంది. కొత్తగా కాపురానికొచ్చిన రోజుల్లో రమణ చదువు మానేశాడని గునుస్తుండేదట. అందుకని వాడు దీక్షపట్టి బి. ఏ. ప్యాసయ్యాడు. నేను కాలేజీలో చదివికూడా కాలేకపోయ్యాను."

రమ గలగలనవ్వింది. "నువుకూడా ఎవరినైనా ప్రేమించు. పరీక్షవుతావు."

పరమేశం కుంచించుకుపోయ్యాడు.

"ఎవరినయినా పెళ్ళాడు. ఆవిడ గునుస్తుంటేనన్నా ప్యాసుకావచ్చు" రమ పళ్ళు బిగబట్టి నవ్వు ఆపుకుంటూ వొక్కొక్క మాటే జార్చింది.

పరమేశం చెయ్యి కడుక్కుంటూ కోపంతో "నవ్వు నవ్వు! నా గతిచూస్తే నవ్వకపోవటంకూడా పాపమే" అన్నాడు.

రమ వొక్కసారి బుసకొట్టింది. "ఏమన్నా నన్నయ్యా అంతలా ఇదవుతావు. ఇక నీతో మాట్లాడనులే" అంది. పరమేశం విసురుగా వంటిల్లు దాటేశాడు. రమ వంటింట్లోంచి అరచింది.

"పక్కేసి, సరును పడుకోబెట్టు అన్నయ్యా, తర్వాత నేను తీసుకుంటాను."

పరమేశం పక్కపరచి, సరోజను తెచ్చి పడుకోపెట్టాడు. దీపం పెద్దదిచేసి నడవగదిలోకి తొంగిచూశాడు. యోగవాసిష్టం చదువుకుంటూ పెదనాన్న తన్మయుడై పోతున్నాడు. ఆయన కున్నంత శ్రద్ధకూడా తనకు లేకపోయె. దీపంపెట్టుకుని చదువు కుందుకు కూచున్నాడు పరమేశం.

ప్రొద్దున్నే గోడవారగా కూచుని పరమేశం కాఫీ త్రాగు తుంటే రమ అన్నది.

"రాత్రినామీద నీకు చాలాకోపమొచ్చింది కదన్నయ్యా"

"కోపం రాలేదుకాని, బాధ కలిగింది."

రమ స్వచ్ఛంగా నవ్వింది.

"ఎందు కన్నయా?" అన్నది.

"ప్రతిసారీ నావెలితి నాకు చూపించటం దేనికి?"

"ఛా, ఛా, నవ్వులాటకు అమాత్రం అన్నయ్యను చెల్లె లనకూడదా?" అంది రమ.

"నిజంగా వాడిసంగతి తెలిస్తే నువ్వలా నవ్వులాటకింద తీసిపారెయ్యవు."

ఈ మాటనగానే రమ చాలా బాధపడింది. నిజానికి రమ రమణమూర్తి గురించి నవ్వులాటగా తీసుకోలేదు. ఆమెది చాలా సున్నితమైన హృదయం. ఏమాత్రం విచారకరవార్త విన్నా ఆమెహృదయం చలిస్తుంది. రాత్రంతా ఆమె సరిగ్గా నిద్రపోలేదు కూడా. రమణమూర్తిని గురించి చాలా ఆలో

చించింది. తనకెందుకీ ఆలోచన అని వదిలించుకో బోయింది. కాని పరమేశం చెప్పిన సంగతు లామె మరచిపోలేక పోయింది.

"నేనేం ఆయనసంగతి విని సంతోషించలేదు" అన్నది కోమలమైన స్వరంతో.

"ఇవాళ సాయంత్రం వస్తానని చెప్పాడు" అన్నాడు పరమేశం. రమ వులిక్కిపడ్డది.

"కాని నువ్వాయనతో వెనకటి సంగతులు తవ్వకు" అంది.

సాయంత్రం రమణమూర్తిని వెంటబెట్టుకుని వచ్చాడు పరమేశం. నిన్నటికంటే ఇవాళ కాస్త పరిశుభ్రంగా అవపడు తున్నట్లు పరమేశం కనిపెట్టాడు. బయటి హాల్లో పరమేశం పెద నాన్న గీతాభాష్యం చదువుకుంటున్నాడు. రమణమూర్తి హాలులో అరుగుమీద కూలబడ్డాడు. పరమేశంకూడా పక్కన్నే కూచున్నాడు. పెదనాన్న కళ్ళజోడులోంచి తీక్షణంగాచూస్తూ "నీ పేరేమిటి నాయనా" అని అడిగాడు.

"ర...మ...ణ...మహర్షి."

పరమేశం నవ్వలేదుకాని, నవ్వుదామనుకున్నాడు. కాఫీ తీసుకొచ్చిన రమ గడపలో నిలుచుని తళుక్కున నవ్వింది. రమణ మూర్తి నిశ్చలంగా చూశాడు రమ వేపు.

ముసలాయన మండిపడ్డాడు. ఆయన్ను అవహేళన చేస్తున్నాడనిపించింది. నాలు గంగుళాల పొడవున్న తెల్లటి గడ్డం చేతితో దువ్వుకుంటూ ఆయ నన్నాడు. "పరీక్ష తప్పిన వాడు, పెళ్ళాం పోయినవాడూ, రమణమహర్షి కాలేడు

నాయనా. అయినా రమణమహర్షి ఏ పరీక్ష తప్పలేదు, ఆయ నకు పెళ్ళామూ పోలేదు."

ఆయనకు గుబ్బుగావుంది. ఆధ్యాత్మిక జీవితం అంత సుల భంగా అలవడుతుం దనుకుంటున్నందుకు ఆయనకు కోప మొచ్చింది. ఆయ నిక మాట్లాడలేదు. నిశ్చలంగా గీతాపారా యణం చేసుకుంటున్నాడు. పరమేశం భయపడిపొయ్యాడు. పెదనాన్న మాట్లాడినమాటల్లోని వ్యంగ్యబాణాలు అతడి హృద యాన్ని ఛేదించినయ్. ఇదివరలో కోపమొచ్చి తను దేశాలమీద పోతానని పెదనాన్నకు ఉత్తరం వ్రాశాడు. అందుకని పెద నాన్న సమయం జారవిడువకుండా పరమేశాన్ని బాధిస్తూనే వున్నాడు.

నిశ్శబ్దాన్ని భంగపరచట మెలాగో అక్కడున్న వా ళ్లెవ రికీ తెలియలేదు. రమ చేతిలోంచి కాఫీగ్లాసందుకుని పరమేశం రమణమూర్తి కందించాడు. ఇంతలో సరూ పరుగెత్తుకుని పర మేశం దగ్గరకు రాబోయి పక్కన్నే రమణమూర్తిని చూసి ఆగి పోయింది. కళ్ళు పెద్దవిచేసి భయం భయంగాచూస్తూ, కళ్ళకు చేతులడ్డంచేసి, వేళ్ళలోంచి కళ్ళుతెరచి చూస్తూ, "అమ్మో! బూచి" అంది.

"చొక్కా వేసుకరా సరూ" అన్నాడు పరమేశం.

"ఈ బూచా డెవరు, అన్నయ్యా," అన్నది సరోజ. అని చిన్నగా నవ్వింది. సరోజను రెక్కపట్టుకుని తీసికెళ్ళింది రమ. పరమేశం నవ్వాడు.

రమణమూర్తికి చాలారోజుల తర్వాత తన కూతురు జ్ఞాపకాని కొచ్చింది. తాను చూసినప్పటికి పదిరోజులపిల్ల. తరువాత మళ్ళీ చూడలేదు. అతడికళ్ళకు నీళ్లు తిరిగినై. అతి కష్టం మీద వాటి నాపుకున్నాడు.

రమ ఏం చెప్పిందో, సరోజ బిక్కుబిక్కుమంటూ పరమేశం వొళ్ళో వచ్చి కూచుంది.

"ఇలా రా అమ్మా" అన్నాడు రమణమూర్తి.

సరోజ రానని తల ఊపింది.

"వెళ్ళమ్మా" అంది రమ గడపలో నిల్చుని.

"సరో, వెళ్లు" అన్నాడు పరమేశం.

సరోజ బెరుగ్గా చూసింది. చప్పున రమణమూర్తి చేతిలో వున్న పూలుగుత్తి లాక్కుంది. పచ్చటిపూలు పసుపుపచ్చగా వున్నాయి. ఒక్కటే చెట్టుంది పార్కులో. పార్కుచుట్టూ కట్టిన ఇనుపతీగెల నానుకుని, సగం బయటరోడ్డుమీదికి, సగం పార్కులోకి విస్తరించివుంది. చక్కటి పూలు పూస్తుంది. సాయంత్రం సూర్యాస్తమయపు యెఱ్ఱటికాంతులు, ఆ పసుపుపచ్చ పూల మీద మెరుస్తుంటే, రమణమూర్తి చాలాసార్లు చూశాడు. తన్మయత ననుభవించాడు. రోజూ ఒక్కగుత్తి కోసుకుంటాడు. నిర్గంధ కుసుమాలు. అయినా అతడికి వాటినిచూస్తుంటే, ఒకవిధమయిన ఆనందం కలుగుతుండేది.

"రోజూ ఇలాటిపూలుతెస్తే నీ దగ్గరకొస్తాను బూచీ" అంది సరోజ. రమణమూర్తి చాలారోజులతర్వాత స్వచ్ఛంగా నవ్వాడు.

"రోజూ తెచ్చిపెడతాను. మరి ఇలారా" అన్నాడు.

సరోజ రమణమూర్తి వొళ్ళో వచ్చి కూర్చుంది. వొళ్ళో కూచుని ముఖంలోకిచూస్తూ, లేతవేళ్ళతో, గడ్డాన్ని స్పృశిస్తూ "నిన్ను చూస్తే భయమేస్తున్నది" అన్నది సరోజ. రమణమూర్తి మొహం నల్లబడిపోయింది. మళ్ళీ నవ్వుతూ "పూలు తెచ్చిపెడతానుగా" అన్నాడు. సరోజముఖం సంతృప్తి వహించినట్లనిపించింది.

చీకటిపడగానే రమణమూర్తి వెళ్ళిపోయాడు.

ఆరాత్రి అతడి కో వింతైన కలవచ్చింది.

తాను తన అత్తగారి వూరెళ్ళాడు.

అత్తగారు కూతురిని అందించబోయింది.

"బూచి. నే పోను" అని మారాంచేసింది చిట్టి.

"కాదమ్మా, నాన్న"అని చెప్పబోయింది అత్తగారు.

"నాకు భయ మేస్తుంది. నేను పోను" అని యేడ్చింది చిట్టి. చిట్టి అచ్చం సరోజలా కనపడ్డది రమణమూర్తికి. చిట్టిని చూసి తాను ఏడునెలలు కావస్తున్నది. ప్రొద్దున లేవగానే రమణమూర్తికి దిగులుపట్టుకుంది. తనకూతురు తనని గుర్తించకపోతే తనను 'బూచీ' అని భయపడుతుందా ?

ఆతడు సాయంత్రం కాగానే. పార్కుకెళ్ళి, పూలగుత్తి తీసుకుని పరమేశం వాళ్ళింటికి వెళ్ళాడు. ఇతడిరాక వూహించని ఇంటిల్లిపాదీ ఆశ్చర్యపడ్డారు. పరమేశం ఇంట్లో లేడు.

రమణమూర్తి ఇంట్లోకివెళ్ళి సరోజను పిలిచాడు.

రమ బయటికి వచ్చింది. "అన్నయ్య ఇంట్లో లేడు" అన్నది.

"సరోజను పిలవండి" అన్నాడు రమణమూర్తి.

"ఎదురింటివాళ్ళింటికి ఆడుకోటానికి వెళ్ళింది, కాసేపు కూచోండి, వస్తుంది" అంది రమ.

"పూలుతెచ్చాను. ఇవి సరోజకు నేతెచ్చానని చెప్పండి"

రమణమూర్తికి వాకిట్లో సరోజ కనపడ్డది.

"పూలుతెచ్చావా, బూచీ" అన్నది.

రమణమూర్తి పలక్కుండా వెళ్ళిపొయ్యాడు. వెనకనుంచి సరోజ అరుస్తున్నది.

"ఎందుకు కోపం, బూచీ."

మరుసటిరోజు రమణమూర్తి అదేవేళకువచ్చాడు. సరోజ పోయి రమణమూర్తివొళ్ళో కూచుంది. పూలు తీసిఇచ్చాడు.

"నువు మంచిబూచివి. అసలు నువు బూచివికావు. బూచీ ఐతే పిల్లల నెత్తుకపోతాడుగా, రోజూ నాకు పూలుతెచ్చిపెట్టేం."

పరమేశం ఆరోజు ఇంట్లోనే వున్నాడు.

రమ కారాత్రి నిద్రపట్టలేదు.

'ఏమిటీ పిచ్చిమనిషి, ఎటువేపు నడుస్తున్నాడు. ఎన్నాళ్ళిలా వుంటాడు' అనుకుంది. ఆమె కళ్ళలో నీళ్ళుతిరిగినై.

ప్రొద్దుటే పరమేశంతో అన్నది రమ "అయితే రమణమూర్తిగారి కూతురెలా వుంటుందేం" అసలు ఎలానోలాకదిపితే పరమేశం చాలాసంగతులు చెపుతాడని తెలుసు రమకి.

"నేచూళ్ళేదు. వాడినడగను. అడిగితే కళ్ళనీళ్ళు పెట్టుకుంటాడు. గతం గుర్తుచేసి, గాయంరేపటం ఇష్టంలేదు."

రమ ఉస్సురని నిట్టూర్చింది.

"ఆయన మళ్ళీ పెళ్ళిచేసుకోకూడదా?" రమ పళ్ళు బిగబట్టి అంది.

పరమేశం అదోలా చూశాడు రమ మొహంలోకి.

రమ తల వాల్చేసుకుంది. "మరి ఆ పసిపిల్ల నెవరు చూస్తారు?"

"రమణమూర్తికి అత్తా, మామా బ్రతికే వున్నారు" అన్నాడు పరమేశం. "వాళ్ళే చూస్తున్నారు."

"మరి ఆయన్నెవరు చూస్తారు" అంది రమ.

"ఎవరూ లేరు."

"అందుకే పెళ్ళిచేసుకోకూడదూ ?"

పరమేశం మాట్లాడలేదు. "నువు చెప్పు" రమ లేచిపోయింది.

ఆరాత్రి రమకు చాలావూహాలు రేగినై.

తన పెళ్ళిచెయ్యటానికి తనతండ్రి ఎంతో దిగులుపడుతున్నాడు. తల్లిలేదు, చెల్లెలు చిన్నది. అన్న యెక్కడుంటే, వాడి సంపాదన వాడికేచాలదు. తండ్రి ఏసంగతీ పట్టించుకోడు. ఇంటివ్యవహారం గుర్తొచ్చినప్పుడల్లా, యోగవాశిష్టం పట్టుకుంటాడు. అలానే దిగులుగా నిద్రపోయింది రమ.

నిద్రలో కలవచ్చింది. రమణమూర్తి ఆత్మహత్య చేసుకుంటున్నట్లు కలగన్నదామె. వణికిపోయింది. రమణమూర్తి కూతురు తొనలుతొనలు వొళ్ళుతో, పాలబుగ్గలతో, గుండ్రని కళ్ళతో కనిపించింది అనాధలాగా. ఆ పసిపిల్ల యేడ్చింది. గుక్కపట్టి ఏడ్చింది. రమ సరోజను గుండెలకు హత్తుకుంది.

మర్రోజు రమణమూర్తి పూలుతీసుకుని వచ్చాడు. రమ అతడివేపు కళ్ళెత్తి చూడలేకపోతోంది. సరోజ కతడు బాగా అలవాటయినాడు. పోయి వొళ్ళో కూచుంటుంది. కబుర్లు చెబుతుంది కళ్ళూ, చేతులూ తిప్పుతూ. అత డున్నంత సేపూ, ఇంకెవరినీ అతడితో క్షణంకూడా మాట్లాడనియ్యదు. అతడుకూడా సరోజాతో ఆడుకుంటాడు. అత డా ఇంటికి సరోజకోసమే వస్తున్నాడు. ఆ సంగతి అతడి ఆత్మ చెబుతున్నది. తన కూతురు గుర్తొస్తుందతడికి. అతడిక ఒక్కక్షణం నిలవలేడు. పార్కులో కెళ్ళి పూలుకోసుకుని సరోజవద్దకు పోతాడు. వళ్ళో కూచోబెట్టుకుని ఆడిస్తాడు. అతడి ఆత్మకి అమృతం త్రాగినంత తృప్తి. సరోజను ముద్దెట్టుకుంటాడు. చిట్టి చేతులతో తుడుచుకుంటుంది సరోజ.

ఒకరోజు రమ టిఫిన్ చేస్తున్నది. రమణమూర్తి ఆరోజు మధ్యాహ్నం మూడింటికే వచ్చాడు. టిఫిన్ ప్లేట్లలోసర్ది "ఆయనకి తీసుకెళ్ళి ఇయ్యన్నయ్యా" అన్నది రమ.

"నువ్వే తీసుకెళ్ళు రమా, నువ్విస్తే తప్పకతీసుకుంటాడు. నే తీసికెళితే వద్దంటాడు" అన్నాడు పరమేశం.

"నీ క్కాని మతిపోతుందేమిటన్నయ్యా" అన్నది రమ కోపంగా. లోపల్లోపల రమ కా మాటలు హాయిగానే వున్నాయి.

"అస్తమానం నీగురించే మాట్లాడుతాడు రమా, అందుకని..." అన్నాడు పరమేశం.

రమ బ్రమాన్పడిపోయింది.

బయట సరోజ రమణమూర్తితో తగవు పెట్టుకుంటున్నది, పూలు తేలేదని.

రమణమూర్తి మూడింటికే రావటంవల్ల మరచి పొయ్యాడు. తెచ్చిస్తానని చెబుతున్నాడు. అలా వినలేదు సరోజ, ముందుతేవాలి, అన్నది. పరమేశం గొంతు చించుకుంటున్నా వినకుండా రమణమూర్తి వీధిలో కెళ్ళిపొయ్యాడు.

రమ ఆకాశంకేసి చూస్తూ నిలుచుండిపోయింది.

రమణమూర్తి పార్కులో కెళ్ళాడు. అతడికళ్ళు తిరిగి పోయినై. తూలిపడి పోతానేమో ననుకున్నాడు. యేడుపొచ్చింది. పచ్చపూలచెట్టు మొదలంటూ నరికివుంది. కొమ్మలు చుట్టూ కుప్పబెట్టి వున్నాయి. చెట్లకు నీళ్ళుపోసే కాపలావాడి దగ్గరకెళ్ళి అడిగాడు రమణమూర్తి, వాడుచెప్పాడు.

"ఎలక్ట్రిక్తీగెల కడ్డమొస్తే, ఎలక్ట్రిక్వాళ్ళు కొట్టేశారు. బహు మొండిసెట్టుబాబూ, యేడాదిలో మళ్ళీ ఇంతదవుతుంది. ఆర్నెల్లలో పూలు పూస్తుంది."

చాలారోజుల తర్వాత మొట్టమొదటిసారి భవిష్యత్తు మీద అతడికి విశ్వాసం కలిగింది. ఆశ కలిగింది. ఆకాశంకేసి వెఱ్ఱిగా చూశాడతను. ఆరోజు మళ్ళీ సరోజదగ్గరకి పోలేదు. మర్రోజూపోలేదు. పరమేశం వచ్చాడు. రమణమూర్తి చెప్పాడు "రెండుమూడు రోజుల్లో అమ్మాయిని చూసివస్తా పరమేశం" మర్రోజు పోలేదు. ఆమర్రోజు పార్కులో మొండిచెట్టుచుట్టూ తిరుగుతున్న రమణమూర్తికి పరమేశం కనపడి, "ఊరికెళ్ళే ముందు, నిన్నోసారి కనపడమంది రమ" అని చెప్పాడు.

★

## దివ్యప్రభాకర్

వీరి వయస్సు 24 సం. లు. వీరు తెలుగు పాఠకులకు పత్రికాముఖాన చిర పరిచితులు. 'పూలరాశిలో కారుచిచ్చు' అన్న వీరి నవల ఆంధ్రప్రభలో ప్రచురితమై, ప్రస్తుతం పుస్తకరూపాన రానున్నది. 'నిరవధి' అన్న వీరినాటిక ఆంధ్రరాష్ట్రంలో వివిధ నగరాల్లో ప్రదర్శించబడి, అనేకచోట్ల ప్రథమ ద్వితీయ బహుమతు లను గూడా పొందింది.

'ఆశకు అంతం' అనే వీరి నాటికాగుచ్ఛం త్వరలో ప్రచు రింపబడనున్నది.

నవ్యసాహితీ సమితి నిర్వహించిన అఖిలాంధ్రపోటీలో వీరి ఏకాంకిక 'వంశదేవత'కు తృతీయ బహుమతి లభించినది. రేడియో నాటిక రచనలోగూడా వీరు ప్రవీణులు.

ప్రస్తుతం వీరు 'గుడివాడ రచయితల సంఘానికి' కార్య దర్శిగా వుంటున్నారు.

"రసపుష్టిలేని రచనలో 'వస్తువు', 'విషయం' ఇత్యాదులు ఎంత ఎక్కువగావున్నా అది రాణించదు, ప్రజాదరణ పొందదు." అంటారు వీరు. మనస్తత్వ చిత్రణ రచనలో ప్రథమస్థానంలో వుండాలని వీరి ఆకాంక్ష.

★

# 'వరకం'

అదొక విచిత్రావస్థ. నేను ఎక్కడున్నానో నాకే తెలియని స్థితి. ఇంద్రజాలం కావచ్చు! స్వప్నం కావచ్చు!

నాకు గోచరమౌతున్న దృశ్యాన్ని యథాతథంగా వర్ణించటం మానవమాత్రులవల్ల అయే పనికాదు.

ఒకప్రక్క సూర్యుడు. మరొకప్రక్క చంద్రుడు! వేరొక ప్రక్క వర్ణించలేని ఒక విచిత్రగోళం. అది మట్టిముద్దవలె వుంది. నా జీవితంలో ఎన్నడూ చూడనంత పెద్దవిగా కనుపిస్తున్నాయి తారలు! వాటి కాంతికి తట్టుకోలేక అంధత్వం ప్రాప్తిస్తుందేమోననిపిస్తోంది.

నా బ్రతుకంతా ఆనందమయం కాదు. అయినా స్వర్గతుల్యమైన క్షణాలుకూడా చవి చూశాను. కానీ ఎన్నడూ ప్రత్యక్షంగా కానీ, స్వప్నాన కానీ ఇటువంటి దృశ్యాన్ని తిలకించి ఎరుగను.

నేను తేలిపోతున్నాను. ఈ తేలిపోవటం గాలిలోనని నిశ్చయంగా చెప్పలేను. అసలు నేను గాలి పీలుస్తున్నట్టు నాకేమాత్రం అనిపించటం లేదు. నన్ను నేను చూసుకున్నాను, ఏమీ కనిపించ లేదు, కానీ, నాకు 'నేను' అనేభావం మాత్రం వుంది. నాకూ, ప్రకృతికీ భేదం విస్పష్టమౌతోంది. నేనూ ప్రకృతిలో ఒక భాగాన్ని అని తేటతెల్లమౌతోంది. నేను అలాఅలా తేలిపోతున్నాను. ఎన్నో చుక్కలు నన్నుదాటి క్రిందికి పోతు

న్నాయి. నేను రెక్కలున్నట్టు అతివేగంగా ఊర్ధ్వ ముఖుణ్ణాయి ఎగిరిపోతున్నాను. నా ప్రస్థానానికి నేను కారకుణ్ణి కాను. నా ప్రారంభస్థానం నాకు తెలీదు. నాగమ్యం అసలే తెలీక నన్ను మరింత విభ్రాంతునిగా జేస్తోంది. నేను రిచ్చవడిదృగ్గోచర మౌతున్న సమస్త ప్రకృతినీ అత్యాసక్తితో తిలకిస్తున్నాను. ఆ చంద్రుడూ, సూర్యుడు. తారలూ,...ఆ విచిత్ర. గోళం ... మట్టిముద్ద ... దాన్ని ... అన్నిటినీ చూస్తున్నాను.
ఆశ్చర్యం!

నాకు తోటిప్రయాణీకులు ఎవరూ ఉన్నట్టులేరు. చుట్టూ చూడగా అంతా అవర్ణనీయ తేజోమయం! ఏది సత్యమో, ఏది మిథ్యో నిర్దిష్టంగా గుర్తించలేని శక్తిహీనుణ్ణి! నేను ఏదో ఒక అమోఘశక్తిచేత ఆకర్షింపబడుతున్నాను. నా మేధ అటుపోవా అని కోరడం లేదు. అయినా నా యిష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండానే నా పయనం సాగిపోతోంది.

ఓహో! ఎంత రమణీయమైన దృశ్యం! ఎంత మనోజ్ఞమైన ప్రదేశం! నింగి నీలిమయావత్తూ క్రోడీకరించు కున్నట్టున్నదా ప్రదేశం! యవ్వని కోరికలవలె తెల్లనిమేఘాలు అక్కడక్కడా తేలిపోతున్నాయి.

నా చివరి క్షణాల్లో కూడా జీవితంమీది ఆసక్తివల్ల వైద్యుడుపోసిన మందులు త్రాగాను. అవి విషంకంటె ఘోరంగా ఉన్నాయి. ఇటువంటి మహాద్భుత స్వప్నాన్ని కనగలగటానికే నేమో ఇంకా ఇంతజబ్బుతో కూడా బ్రతికి ఉన్నాను! ఇది స్వప్నమో! కాదు. కాదు...కాదూ?

ఎదురుగా ఎత్తైన సింహాసనం - ఏది వ్వో లేకుండానే దేదీప్య మానంగా వెలిగిపోతోంది. ఒక సుందరాకారుడు దానిమీద అతి ఠీవిగా కూర్చున్నాడు. అతన్ని సమీపించటంతో నాపయనం పూర్తి అయినట్లుగా ఆగిపోయాను. ఇంతవరకూ అద్భుతంగా పనిచేసిన ఆకర్షణశక్తి విరళమైంది.

"ఓ! మరణించిన మానవుడా!" అన్నాడు గంభీరస్వరంతో ఆయన.

నేను మరణించానా? నేను మరణించానా! అది ఎలా సాధ్యం?...నేను యథార్థంగా మరణించానా?...అవును. మర ణించే వుంటాను. నాకు పెద్ద జబ్బుగావుంది. బంధువులంతా నా మంచంచుట్టూచేరి నన్ను తలోకప్రశ్నా వేస్తున్నారు. డాక్టరు నానోట్లో ఇంతంతమందు మాటిమాటికీ పోస్తున్నాడు. రాధమ్మ...రాధమ్మ...నా చిట్టితల్లి నా కాళ్లదగ్గర కూర్చుని వెక్కి వెక్కి ఏడుస్తోంది! ప్రసవ వేదనతో ప్రక్కవసారాలో వున్న నాసీత...సీత...'నాగతి ఏంజేసిపోతారు!' అని యిల్లు ఎగిరి పోయేట్టు అరుస్తోంది! నాసీత! పిచ్చిసీత!

'నాజీర్ణ కుటీరాంతర విశీర్ణశయ్యలో నేను! నావిశీర్ణ కుటీరాంతర జీర్ణశయ్యలో నాసతి!!'

అంతే! అంతవరకూ నాకు తెలుసు! తరవాత నాకు వాళ్ల మాటలు వినిపించలేదు. నాకు ప్రపంచం తెలీదు. అంతా అంధ కారం ఆవరించుకుంది. ఆ తమస్సులోనుంచి మహాద్భుతంగా ఈ సహస్ర దీధితులలోకి వచ్చిపడ్డాను! పయనించాను.

నాకు ఆ జగత్తుతో సంబంధం తెగిపోయిందిగావున్ను! నేను మళ్లీ ఎన్నడూ నా చిట్టితల్లిని చూడలేనుగాబోలు!

ఆయన నావంకే చూస్తున్నాడు. ఆయన మళ్లీఅన్నాడు. "ఓ! మరణించిన మానవుడా! నీజీవితం ముగిసింది. నువ్వు మానవ కళేబరాన్ని ఆ మంటిలోకాన విడిచివచ్చావు. ఇక ఆలోకపు స్మృతులూ, బాంధవ్యాలూ, వాత్సల్యాలూ మాత్రం నిన్ను ఆశ్రయించుకుని ఉన్నాయి. అదుగో, చూసుకో, నీమీద ఉన్న ఆ అంగీ...దాన్ని అక్కడ పారవెయ్యి. అక్కడితో నువ్వు ఈ అమరసీమలో నిలువగల శక్తినీ, అధికారాన్నీ కలిగిన వాడి వౌతావు. అటుచూడు. ఆ మహోన్నతద్వారం. అదే స్వర్గద్వారం. ఆ అంగీని విడిచేసి ఆమార్గాన వెడలిపో...అది వదలిన మరుక్షణాన నీ జ్ఞాపకాలు, మర్త్యలోక స్మృతులూ అంతరిస్తాయి..." అన్నాడు.

ఇదిస్వర్గం. ఇక్కడనాకు తల్లిదండ్రులూ, ఆలుబిడ్డలూ, బంధుమిత్రులూ ఎవరూ వుండరు. జీవితాన్ని దహించివేసే దారిద్ర్యం వుండదు. బ్రతికివుండగానే కాల్చివేసే దారిద్ర్యం, నిరుద్యోగం! హు! ఇవేవీవుండవు. పూటపూటకీ తిండిగింజలు వెతుక్కోవలసిన దుర్గతిలేదు. అడ్డమైనవాళ్ల నందరనూ ఆశ్రయించ వలసిన అగత్యం ఉండదు. బ్రతుకుకంటే చావే నయమని అనుకుంటూనే బ్రతకవలసిన అవసరం, నికృష్టస్థితీ వుండవు. హాయిగా విశ్రమించటం, అందిన అందాన్నీ ఆనందాన్నీ అనుభవించటం వినా మరొక కర్తవ్యం, బాధ్యతా వుండవు. ఎంతచక్కని దీలోకం!

నేను ఆలోచనల్లో తేలిపోతున్నాను. నాకొక క్రొత్త స్వరం వినిపించింది.

"ప్రభూ!"

అటుచూశాను. ఎవరో స్వర్గ ద్వారంగుండా లోనుంచి బయటకు వస్తున్నారు.

"వచ్చావా! ఇదుగో యీ మానవుడు మరణించాడు. ఆ అంగీ నీకుఇస్తాడు. దాన్ని ధరించి నీవు మర్త్యలోకాన జన్మించు." అంటూ ఆజ్ఞాపించాడు - సింహాసనంమీద కూర్చున్న ఆయన.

ఓహో! ఇది పుట్టబోయే ప్రాణికాబోలు!...హు! ఎందుకు పుట్టటం? ఆ శోకపులోకాన ఏమనుభవించాలని? నేనిలా అనుకుంటూ వుండగానే ఆ ప్రాణి యిలా అంది. "నువ్వాలోకంనుంచి వస్తున్నావా? ఎంత అదృష్ట వంతుడివి! ఎంత ధన్య జీవివి! ఎన్నో సుఖాలు అనుభవించి వుంటావు. ఎన్నో రకాల ఆనందాలు చవిచూచి వుంటావు. నిన్ను కలుసు కోవటంవల్ల నాకు ఎంతో సంతోషంగా వుంది. ఇవ్వు-నాకు ఆ అంగీ యిచ్చెయ్యి. నేనాలోకానికి తిరిగి వెళ్లటానికి ఎంతో తొందర పడుతున్నాను." అంటూ నాకు చెందివున్న అంగీవంక ఆశగా చూసింది.

నాకు కోపం మండిపోయింది. బిగ్గరగా అన్నాను: "ఏమిటి నీ ఉద్దేశ్యం? ఆ లోకంలో ఏదో సుఖం వుందనేగా! నువ్వు అనుకుంటున్నంత సుఖం, ఆనందం ఆలోకంలో ఏమాత్రం లేదు. అది శోకపులోకం. అక్కడి మానవుల ధర్మాలు ఏమిటో

తెలుసా ?- కష్టపడటం, నష్టపడటం... రెండే! అంతే! కాలంతో పాటు మారని, మార్చని ఆచారాలూ, ఆర్థిక స్థితితోపాటు సమ్మిళితం కాలేని ఆడంబరాలూ...ఇదీ ఆలోకం..." నన్ను పూర్తిగా చెప్పనీకుండానే ఆప్రాణి అందుకుని "నేను నీమాటలు నమ్మను. నువ్వు నన్ను వంచించలేవు. నాకు తెలుసు! ఆ లోకం ఎంతో అందమైంది. ఆనందమయమైంది ఈ స్వర్గంలో వుండీ వుండీ విసిగి పోయాను. మార్పులేదు. కొత్త రుచులు లేవు. ఎల్లవేళలా ఒక్కటే కర్తవ్యం. ఒక్కటే కార్యక్రమం. ఒక్కటే చర్య. అబ్బ! విసిగిపోయాను. నేను జన్మించబోయే లోకంలో రకరకాల ఆనందాలు. రంగు రంగుల పూలగుత్తులు. సంధ్యారాగంలో సౌందర్యం, అర్కాస్తమయంలో అరుణవర్ణం, మందమారుతంలో పులకరింతలు...ఎన్నో ఉన్నాయట!- ఒకరిమీద వొకరికి ప్రేమ, అనురాగం, వాత్సల్యం, కరుణ...ఎన్నో ఉన్నాయట! ...ఇక్కడ ఎవరూ ప్రేమించరు. ఎవరి కరుణా లభించదు. ఎవరూ వాత్సల్యం చూపరు. హు!" అంటున్నది. నాకామాటలు మహా క్రోధాన్ని తెప్పించాయి.

"ఆగు. అంతట ఇక ఆగు! ఆ లోకాన్ని గురించి నీకు తెలియాలంటే నేను చెప్పేది విను. నేను చదువుకున్నాను. ఉద్యోగం దొరకలేదు. దొరకదు-నేను పేదవాడిని కాబట్టి! ఆ లోకాన్ని ఆడించేది అసత్యం! అవినీతి!! డబ్బు!!! డబ్బు మెండుగా వుంటే అసత్యం సత్యంగానూ, అవినీతి నీతిగానూ మారిపోతుంది. డబ్బులేనివాడి ఏ గొప్పదనమూ రాణించదు. ఏ సత్యమూ జయించదు. ఏ నీతీ నిలువలేదు. వాడిని ఎవరూ

గుర్తించరు. గుర్తిస్తే గ్రద్దల్లా పొడిచి చంపేస్తారు...నేనూ పెళ్ళి చేసుకున్నాను. వర్ణాంతరవివాహం చేసుకున్నానని సంస్కర్తనంటూ దండలువేసి ఊరేగించారు. అంతే! ఇక నిత్య జీవితంలో పచ్చి మంచినీళ్ళు పుట్టలేదు. పుట్టవు. ఎవరూ రారు. ఎవరింటికీ నన్ను పిలువరు. మేమిద్దరం బ్రతకటానికెన్నో పాట్లు పడ్డాం. మా బ్రతుకులు భారమైనాయి. మా కొక బిడ్డ. రాధ! నా రాధ! నా చిట్టితల్లి రాధ! తన ముద్దులతో, ముద్దు మాటలతో, తన కళ్ళకాంతితో మా కడుపులు నింపింది. కొంత కాలం దారిద్ర్యాన్ని మరచాము. తిరిగి మొదలు...చూడు మిత్రమా! ఆ లోకంలో ఎవడూ జీవితాన్ని జయించలేడు... డబ్బు వున్నంత మాత్రాన జీవితాన్ని జయించలేడు. అదిరించటానికీ, అధికారం చలాయించటానికి మాత్రమే ఆ ధనం ఉపకరించేది. ఉన్నవాడికి ఎన్నో ఆలోచనలు. క్షణం విశ్రాంతిలేదు. కంటిమీద కునుకు వుండదు." నేను చెపుతూండగానే ఆ ప్రాణి ప్రశ్నించింది.

"అయితే ఆ లోకంలో యుద్ధాలు వున్నాయా?"

"హు! లేకేం. యుద్ధాలు కావలసినన్ని! అనుదినం, అనుక్షణం - జరుగుతూనే ఉంటాయి. కానీ ఆయుద్ధాలు దేశానికీ దేశానికీ మధ్యకాదు. రాజ్యానికి రాజ్యానికీ మధ్యకాదు. అక్కడ జరిగే యుద్ధాలు హృదయానికీ హృదయానికీ మధ్య! అది అతిఘోరం! దాన్ని ఎవరూ అడ్డలేరు. దాన్ని నివారించటానికి మధ్యవర్తిత్వాలూ, రాజీలు పనికిరావు. ప్రేమకావాలి, వాత్సల్యం కావాలి, కరుణకావాలి. అక్కడ అవేశూన్యం.

ఆలోకంలో బ్రతికేవా ళ్లందరికీ చావుమీద ప్రీతి ఎక్కువ. ప్రతి వాడూ రోజు కొక్కసారైనా 'ఇంతకంటే చస్తేబాగుండును!' అనుకోనిదే తృప్తిపడడు. అదీ...అదీ ఆలోకం. అంతేమిత్రమా! అంతే!"

ఆప్రాణి యిలా గొణిగింది. "ఆ! కాస్తంతని ఎంతోచేసి చెపుతున్నావు. నీమాటలు నమ్మటానికి వీల్లేదు. ఎంతయినా యీ లోకంకంటే చాలానయం. కష్టమో, సుఖమో ఏదోఒక మార్పుఅయినా వుంటుంది. ఇక్కడ అదీలేదు. ఎప్పుడూ ఒకటే మాదిరి. హు!" అంది నీరసంగా.

"అయితే అఘోరించు. నాకేం! కానీ, మళ్లీ ఆఖరిమాట చెపుతున్నా. నీకాలోకంలో నిజం లభించదు. కరుణ మచ్చుకైనా దొరకదు. ఆదరణ అసలేశూన్యం. ఏకాకివై దారీ తెన్నూ తెలియక యమయాతనలు అనుభవిస్తావు. దారిద్ర్యం చీకటిలా చుట్టిముట్టుతుంది. నిరుద్యోగబాధ అగ్నిపర్వతంలా రగులు కుంటూంటుంది....ఇక నీ యిష్టం...!"

"అయినా ఫరవాలేదు. నాకు సుఖంఅంటే ఏమిటో తెలుసు. నాకు దాన్నిగురించి చాలా బాగా తెలుసు. నేను ఎంతోసుఖాన్ని ఈ స్వర్గంలో అనుభవించాను. నువ్వు కష్టాలను గురించీ, దారిద్ర్యాన్ని గురించీ చెప్తుతూవుంటే నాకెంత ఆనందంగా ఉందనుకున్నావు! కష్టాలంటే ఏమిటి? అవి ఎలా వుంటాయి? సుఖాలకంటే బాగుంటాయా కష్టాలు? వాటితత్వం ఏమిటి?" అంటూ గబగబా అడిగింది.

ఈప్రశ్న వింటూనే నేను పకపకానవ్వాను. నాజీవితంలో ఎన్నడూ నవ్వనివిధంగా నవ్వాను. విరగబడి నవ్వాను.

"ఊఁ, ఊఁ! త్వరగా ఊడతియ్యి అంగీ..." ఆజ్ఞాపించాడు సింహాసనంమీద కూర్చున్న ఆయన.

"కష్టంఅంటే ఎలావుంటుందో నీకు కావాలి, కావాలా? ...ఐతేవిను! వింటే నువ్వు గుండెలుపగిలి చస్తావు. నా తెలివి తక్కువ గానీ, నువ్వు చావటమేవిఁటి? పుట్టబోతూంటేనూ!... అయితేవిను, భార్య ప్రసవవేదన పడుతోంది. చిట్టికూతురు 'రాధ' దిగులు పెట్టుకుని కుమిలిపోతోంది...నాకు జబ్బు. లేవ లేనిస్థితి. ఇప్పుడో, కాసేపటికో అన్నట్టు ఉన్నాను. ఇంట్లో బియ్యపు గింజలేదు. 'పరామర్శకి' అంటూ కొందరువచ్చారు— ఇంతకాలం నన్ను వెలివేసింది వాళ్ళే! 'దిక్కుమాలిన సంసారం' అని తిట్టుకుంటున్నారు వాళ్లు. డాక్టరు 'దయ' దలిచి మందులు పోస్తున్నాడు. పిల్లది కుమిలిపోతోంది! దానికి బిస్కట్లు తెచ్చి పెట్టేవాడు ఆ ముసలిడాక్టరు. అవసరమైతే మందులక్రిందా, బిస్కట్లుక్రిందా చెంబూ, గిన్నే రెండుసార్లు పట్టుకెళ్లాడు. ఇంకా పట్టుకు పోగలడు! పిల్లది కుమిలి కుళ్లిపోతోంది. పరామర్శకు వచ్చినవాళ్లు తిండిలేక పోయారు వాళ్లదారినవాళ్లు. ఇది యదార్థమంటే నువ్వు నమ్మలేవుగదూ!...అవును, నమ్మవు. నమ్మవు. నమ్మితే ఆలోకం పోకడ సాగేదెలా? అయినా నాబాధ చెపుతాను...ఆ కుటుంబానికి దిక్కెవరు? ఆడంబరాలకు పోయి ఆస్థినంతా హరించేసిన నాన్నని తిట్టనా? అందినది అందినట్టు ఎగరేసుకుపోయిన అప్పులవాళ్లని తిట్టనా? శరీరకష్టాన్ని చేసు

కుంచామంశే అడ్డుపడే ఆత్మాభిమానాన్ని, చదువునీ, తిట్టనా? నా దురదృష్టాన్ని తిట్టుకోనా ?...ఏమిటూ సంసారపుగతి ! ఏం చెయాలి? ఏం జరగాలి?...చిట్టితల్లి - రాధమ్మ నా కాళ్ల దగ్గిర కూర్చుని వెక్కి వెక్కి ఏడుస్తోంది. రాధమ్మా!...చిట్టి తల్లీ!" అంటూ ఉండబట్టలేక భోరున ఏడ్చేశాను.

ఏమైందో వాళ్లగతి! నారాధ ఏమైందో!...నాసీత!... పేదరికంలో ధైర్యంచెప్పి, ఆశ నూరిపోసిన నాసీత - నన్ను క్షణం వదిలిపెట్టక సేవచేసిన నాసీత! సీత! ఏమైందో! బిగ్గరగా అరిచాను 'సీతా!' అని. నాగొంతు నాకే వినిపించలేదు. విచిత్ర స్థితి.

"ఊ! త్వరగా విప్పాలి. విప్పి అక్కడపడెయ్! ఆప్రాణి ధరిస్తుంది. నీ సీతగతి ఆప్రాణి చూచుకుంటుందిలే!" అన్నా డాయన.

"ఆ! నా సీతగతి ఆప్రాణి చూసుకుంటుందా?...అంశే? అంశే ? ఆప్రాణి...నా సీతకడుపున పుట్టబోతోందా?... ఆప్రాణి...నాబిడ్డ! నాబిడ్డ! అబ్బ! తల తిరిగిపోతోంది... నాప్రయత్నం ఆట్టే లేకుండానే అంగీ నన్నువీడి......

ఆహా! ఎంతబాగుంది! ఎంత సుందరంగా వుంది! ఎటు వెళ్లాలి?

ఎవరో (!) ఒకాయన సింహాసనంమీద కూర్చుని నాకు దారి చూపుతున్నట్టుగా చెయ్యిజాపాడు. అటుపోయాను - తేలి పోతున్నట్టు. పోతూ పోతూ వెనుదిరిగి చూశాను. ఎవరో ఒకరు-

అక్కడ పడేసివున్న నల్లటి దుస్తులుధరించి అటు ఎటో (?) పోతున్నారు. నాకెందుకు ఎవరు ఎటువెళ్లినా!

నేను పెద్దద్వారంగుండా ప్రవేశించాను. అద్భుత సౌరభం! వింతవింత రంగులు......

నేను క్రమంగా ముందు సాగిపోయాను.



## ఇసుకపల్లి దక్షిణామూర్తి

వీరి వయస్సు 23 సంవత్సరాలు. వీరు రెండు సంవత్సరాలనుంచి కథలు వ్రాస్తున్నారు. భారతి, ఆంధ్ర పత్రిక, ఆంధ్రప్రభ, ప్రజామత, జ్యోతి మున్నగు పత్రికల ద్వారా పాఠకులకు పరిచితులు.

వీరి కథలసంపుటి "చెరగని అక్షరాలు" తెలుగు దేశం వారపత్రికలో ప్రచురింపబడిన వైజ్ఞానిక వ్యాసాలు "మనం-మన పరిసరాలు" అనే పుస్తకం త్వరలో ప్రచురింపబడ నున్నవి.

వీరి కథలు కొన్ని ఉర్దూభాషలోకి అనువదింపబడినవి. వీరు రచించిన ఏకాంకిక "పెళ్ళిచేసుకొని చూడు" పూర్తిగా స్త్రీ పాత్రలతో కూడి ఒక ప్రత్యేకత ఆపాదించుకున్నది. వీరి అభిరుచులు, నాటకరంగం సంగీతం.

వ్యక్తుల్లోని ఉద్ధృత మనస్తత్వాలను ప్రతిబింబిస్తూ రచన చెయ్యడం వీరి కథల్లోని ముఖ్య అంశం.

★

# అతకని బ్రతుకులు

నా అర్ధాంగి అని చెప్పుకుని మురిసిపోయే భర్తపోయినా పావనిలో భౌతికంగా పెద్ద మార్పేమీ రాలేదు. మానసికంగా వచ్చిందో లేదో ఆమెకు తప్ప యింకెవరికీ తెలియనే లేదు. పావని ఈనాడూ సింగారించుకుంటుంది. ముఖాన కుంకం మెత్తు కుంటుంది. కురులలో పూలు తురుముకుంటుంది. సలక్షణమైన స్త్రీ ఎన్ని రకాల అలంకరణలను ఆశిస్తుందో పావని అన్నీ చేస్తుంది.

కాంతయ్యా అన్నీ చూచి సహిస్తాడు. తను ఏదో ఘోర మయిన విషయాన్ని సహించి వూరుకుంటున్నట్లు పావని వూహించటం అతని కిష్టం లేదు. పావని ఏది అడిగినా 'అలాగే నమ్మా' అంటాడు. పావని కాంతయ్యాకు దణ్ణంపెట్టి 'ఇంత మంచినాన్నని భగవంతు డనుగ్రహించినందుకు' కృతజ్ఞత తెలుపు కుంటుంది. కాంతయ్యా ఆమె చేతులు పట్టుకుని 'నీకు దేవు డుంటే మేలు చేస్తాడమ్మా...!' అంటూ వుంటాడు. పావని నవ్వుతుంది. ఆనవ్వు క్షీరసాగర మధనంలో హాలాహలం బయలు దేరినట్లుంటుంది.

పావని కాంతయ్యాకు వక్కగానొక్క కూతురు. పావనిని తన చేతులలోపెట్టి తనభార్య తనువు చాలించటంతో కాంతయ్యా నిలదొక్కుకోలేక పోయినా, పావనిలాంటి ఒక్క జీవినయినా ఈ భూమిమీద పెంచి, వ్యక్తిత్వం కలిపించి, 'తను

పెంచిన మొక్క' అని దూరంనించి చూస్తూ కళ్లుమూసుకుందా మనుకున్నాడు. అంతలోనే పావనిభర్త కాంతయ్య కలలన్నీ కల్లలని నిరూపిస్తూ దాటి పోయాడు. పావనిది కొత్తకాపరం. ఏడవటంగూడా చేతగాదు. ఆనాటిరాత్రి పావనినిచూస్తే యమ ధర్మరాజుకయినా గుండెలు సడలి పోయేవే! కాంతయ్య ఏడవ లేకపోయాడు. కళ్ళల్లో నీళ్లను బయటకు రానీయలేదు.

ఇప్పుడు ఆ యింట్లో పావని...కాంతయ్య. ఇద్దరూ అర్థ జీవితాలను గడుపుతున్నారు. ఇంటిపనంతా పావని చూసుకుం టుంది. సూర్యోదయం అయినతర్వాత పావని యిల్లువదలి బయ టకు రాదు. మధ్యగదిలోపడి నిద్రపోతుంది. ఆమె పనంతా రాత్రిపూటనే చేసుకుంటుంది. రాత్రి పదిగంటలదాకా దొడ్లో అంట్లుతోమటం దగ్గరనుంచీ, యిల్లు కడగటందాకా చేసుకుం టుంది. దొడ్లో నీళ్ళు ఉప్పునీళ్ళు. ఊళ్ళో ఎవరయినాసరే కాశమ్మచెరువు దగ్గరకుపోయి నీళ్లు తెచ్చుకోవలసిందే. పావని బాగా ఆలోచించి చెరువు దగ్గరకు బాగా తెల్లవారు జామున పోతుండటం మొదలు పెట్టింది. అప్పటికి వూరు నిద్రలేవదు. ఆమెపని పూర్తయిపోతుంది. కాంతయ్య దేనికీ ఏమీ అనడు. వకపని చెయ్యమనడు. మరొకటి చెయ్యొద్దని శాసించడు. ప్రతిదానికీ చిరునవ్వుతో సమాధానం చెపుతాడు.

పావని ఆరోజు చెరువులో నీళ్ళ బిందె ముంచి బుజాన కెత్తుకుంటుంటే వెనకాలగా అడుగుల చప్పుడు వినపడింది. పావని వులిక్కిపడి చూసింది. ఎవరో బిందె తీసుకుని వస్తు న్నారు. పావని గబగబా బయటకు వచ్చి వెళ్ళి పోబోయింది.

అతను ఆమెనుచూసి నిర్ఘాంతపోయాడు. తడిసిన మల్లెమొగ్గలా వుంది. కురులలో మల్లెలు అపహాస్యం చేస్తున్నాయి. ముఖాన మెత్తిన కుంకుమ నీటిబొట్టుమీద పడటంతో ముక్కుదాకాజారి చివర పగడంలా జిగేలు మంటున్నది. వకక్షణం అతనివంక చూస్తూ నిలబడ్డ పావని రోడ్డు పక్కగా అతన్ని తప్పుకుని కాలిలో విరిగిన ముల్లును లక్ష్యపెట్టకుండా గృహోన్ముఖియై బయలుదేరింది. ఆగంతుకుడు వచ్చినపని మరిచిపోయి వూరి పొలిమేరదాకా ఆమె ననుసరించాడు. పావని కాళీబిందెతో తన ననుసరించి వస్తున్నవ్యక్తి అడుగుల సవ్వడి గమనిస్తునే వున్నది. వెనుదిరిగి భయంకరమైన సమాధానం ఏదైనా చెపు దామనుకుంది. ఊరులోకి పొలిమేరదాటి వచ్చిన తర్వాతగాని ధైర్యం చిక్కలేదు. ప్రశ్నిద్దామని వెనుతిరిగే టప్పటికి అత నక్కడ లేడు. అతని అడుగుల సవ్వడినే కాకుండా, ఆమె గుండెదడకూడా కొంతదనుక ఆమెను వెంటాడినదని పావని తెలుసుకోలేక పోయింది.

ఇంటికి రాగానే కాంతయ్య కాలిముల్లు తీయించేశాడు. దుస్సంఘటన లయిపోయినా వాటిజాడలు కొంతకాలందాకా వదలిపోనట్లు పావనికాలు కొంచెం తీపుపెట్టింది. కాంతయ్య పిండికట్టు కట్టించాడు.

మరునాడు కాంతయ్య చాలా ఆలస్యంగా ఇల్లుచేరాడు. పావని అతనిలో ప్రజ్వరిలుతున్న ఆశలాంటి జ్యోతిని చూసింది. 'ఏంనాన్నా' అంది.

'ఇంతకాలందాకా నీమాటే వింటూవచ్చాను పావనీ... ఇవాళ నామాట వకటి వింటావా అమ్మా...!' అన్నాడు కాంతయ్య. ఆమాటలోని ఆర్ద్రత, ఎదుటి మేకకైనా హృదయం కరిగిపోయి, తానంతట తానై కటికవాని కత్తికింద తల వాల్చనిచ్చేటట్లుంది.

పావనిఅంది. 'నన్ను సుఖపెట్టటానికే నువ్వేపనయినా చేస్తావని నాకు తెలుసు నాన్నా...అటువంటప్పుడు యీరోజు షరతు ఎందుకు పెట్టావు...!

కాంతయ్య ఖిన్నుడైనాడు. అతని నోట మాట రాలేదు.

'ఏంనాన్నా...చెప్పవేం...' అంది పావని.

'నానోట మాటరావటం లేదు తల్లీ...! అంటూనే ముఖాన్ని చేతుల్లో కప్పేసుకున్నాడు. పావని అతనిహృదయం లోకి చూసింది. చెరువుదగ్గర సంఘటన చెపుదామనుకుంది.

'నాన్నా...నాకెందుకో భయంగావుంది...నిన్న చెరువు దగ్గర...! ఏమిటో చెప్పబోయింది...గద్గదమైంది. కాంతయ్య ఆమెను తనదగ్గరగా తీసుకుని...! చెప్పుతల్లీ...నాబోటి మనిషిగా చేయగలిగిందంతా చేస్తాను...భగవంతుడికి మాత్రం ఎదురు తిరగలేనమ్మా' అన్నాడు. పావని భోరున ఏడ్చింది ఆమెతలలో పూలన్నీ తలలు వాల్చి వున్నాయి.

'నువ్వేమిటో చెప్పబోయావు నాన్నా...!' అంది పావని మాటతప్పిస్తూ. 'ఇప్పుడు కాదమ్మా...నాగుండె దడగావుంది.' అంటూ లేచాడు. పావని మంచంవాల్చి తండ్రిని పడుకోబెట్టి విసిరింది. కాంతయ్య కునికిపాట్లు పడటం మొదలుపెట్టాడు.

పావని విసినికర్ర మంచంకోడుకు ఆనించి యింట్లోపనిలో నిమగ్నమై పోయింది.

పావనికి అదేవ్యక్తి మరి రెండుసార్లు చెరువుధగ్గర తటస్థపడ్డాడు. ఈసారి అతను తనవెంబడి రాలేదు. తను నీళ్లుతీసుకుంటున్నంతసేపూ వడ్డున నిలబడి తరవాత నీళ్లుతీసుకుని వెళ్లిపోయాడు. అతని అడుగులచప్పుడు ఆమెగుండెల్లో స్పందిస్తోంది. ఆమె కేదో ఆలోచన తట్టినట్లయింది. గంభీరంగా పనిలో మునిగిపోయింది.

ఆరోజు కాంతయ్య ఒకవ్యక్తిని తనింటికి తీసుకువచ్చాడు. ముందుగానే చెప్పాడు యింకో మనిషికిగూడా భోజనం పర్వాటు చెయ్యమని. పావని వడ్డించింది. రావచ్చునని సంజ్ఞచేసింది. ఇద్దరూవచ్చి కూర్చోగానే పావని స్తబ్ధురాలయింది. తను చెరువుదగ్గర చూచినవ్యక్తే యితను. ఆమె నిలవలేకపోయింది. గిరుక్కున కూలబడిపోయింది. కాంతయ్య అంటచేత్తోనే లేచి పరుగెత్తుకు వచ్చాడు. 'కళ్లు తిరుగుతున్నట్లున్నాయి నాన్నా' అంది పావని. 'నాతో ఎందుకు చెప్పలేదమ్మా...ఉండు' అంటూ ఆమెను ఆచేత్తోనే గదిలోకి తీసుకుపోయి మంచంమీద పడుకోపెట్టాడు. 'నాకేం భయంలేదు నాన్నా వూరికెనే కళ్లుతిరిగినాయి...' అంది. కాంతయ్య మాట్లాడకుండా వంటింట్లోకివచ్చి అతిథికి భోజనంపెట్టి, తరువాత తను తిని సావిట్లోకి వచ్చాడు.

అతిథిని సావిట్లో కుర్చీమీద కూర్చోబెట్టి గదిలో పావని దగ్గరకు వచ్చాడు.

'చూడమ్మా...ఇప్పుడు భోజనానికి వచ్చాడే...అతని పేరు గోపాలం...మనవాడే...'అంటూ ఉపోద్ఘాతంచెప్పాడు. పావని నిశ్చలంగా తలవూపింది. కాంతయ్యకు ధైర్యం వచ్చింది.

'మొన్న వకసారి చెపుదామనుకున్న విషయం యిప్పుడు చెపుతాను...విధవా వివాహం మనశాస్త్రాలు వప్పుకుంటా యట...నీ జీవితం సుఖపడాలనే గాదమ్మా...నా తాపత్రయం, నిన్ను చూసేగాదమ్మా నే బ్రతుకుతోంది...ఇప్పుడు వచ్చినతను మనకు కావలసినవాడే...అన్నివిధాలా...' అంటూ చెప్పుతుండే లోపల పావని అందుకుని 'నా కర్థమయింది నాన్నా' అంది.

'నీకర్థమయితే నేనింక చెప్పేదేం లేదమ్మా...నీ వుద్దేశం గూడా తెలుసుకోవాలనేగా నాయిది' అన్నాడు కాంతయ్య. పావని అతనివంక సూటిగా చూడలేకపోయింది.

'నీకు తెలియదని గాదు నాన్నా...వివాహ సంబంధం వక్కసారే జరుగుతుంది...జన్మాంతరాల్లో భార్యలూ, భర్తలూ వెతుక్కుంటూవచ్చి యిక్కడ కలుస్తారు. విడిపోవటం అనేది విధిచేసింది...నేనూ అందుకనే ఈ పూలతోనూ పసుపు కుంకుమలతోనూ, ఈ నగలతోనూ, సింగారంగా ఆయన జ్ఞాపకార్థం బ్రతుకుతున్నాను...ఆయన్ను తప్పకుండా కలుసుకుంటాను... అందుకనే యివన్నీ నాన్నా...వీటితోనే ఆయన దగ్గరకు పోతాను...నా...న్నా...నువ్వు మళ్ళీ పెళ్ళి చేసికోనిదిగూడా అందుకేగదూ...' అంది. ఆమెమాట, మరీ భయంకరమైన నిశ్శబ్దతలో వచ్చే పిడుగుల ధ్వనిలాగావుంది. చివరి మాటలకు

కాంతయ్యకు సమాధానం లేదు. ఆమెచేతులు పట్టుకుని 'అవును తల్లీ...' అన్నాడు. పావని ఏడవలేదు. అలాగే చూసింది. కాంతయ్య బయటకువచ్చి గోపాలానితో విషయం చెప్పేశాడు. అతను అర్థం చేసుకోలేక పోయాడు. బరువైన హృదయంతో బయటకు నడిచాడు.

ఆ క్షణంనుంచే పావనిలో మార్పువచ్చింది. ఆమెతలలో పూలు నవ్వటంలేదు. ఆమెముఖాన కుంకుమ మెరవటంలేదు. నగలన్నీ పెట్టెలోకి వెళ్లిపోయినాయి. ఆమె రంగుచీరెలన్నీ దాచేసి తెల్లబట్టలు కట్టుకుంటోంది. ఆమె అశోక వృక్షంక్రింద భర్తను చేరుకోవటానికి తహతహలాడే జానకిలాగుంది.

గోపాలం పార్వతికి ఆరోజు చెరువుదగ్గర తారసపడ్డాడు. అతను ఎన్నో చెప్పాడు. ఆమె అన్నీవింది. ఆఖరికి 'ఎందుకు తిరస్కరిస్తావు' అని అడిగాడతను. 'నాన్న చెప్పలేదా...' అంది ఆమె. 'చెప్పాడు...చెప్పాడు' అంటూ అతను గొణుక్కుంటూ వెళ్లిపోయాడు.

ఆరోజు యింటికి రాగానే పావని అద్దంలో ముఖం చూసుకుంది. ఆమె దేవతలాగా కనిపించింది. పాలరాతి శిల్పంలా వుంది. ఆమె ఏమిటో చాలాసేపు అద్దంలోని ముఖంతో ఆలోచించింది. ఆమె వక నిర్ణయానికి వచ్చింది.

ఆరోజు రాత్రి వంటింట్లోనుంచి పెద్దపెట్టున కేక వినపడగానే వాకిట్లో మంచంమీద పడుకున్న కాంతయ్య నురుగులు గక్కుకుంటూ వచ్చాడు. ఆ దృశ్యం చూచేటప్పటికి అతను అరవనుగూడా లేకపోయాడు. పావని పడిపోయివుంది.

ఆమెముఖం నల్లగా మాడిపోయింది. పొయ్యిమీద బూరెల మూకుడులో నూనె అంటుకుని మండిపోతోంది. అలా విస్మయం చెందిచూస్తుంటే బయటినుంచి ఎవరో పరుగెత్తుకు వచ్చారు. ఇద్ద రినీ ఆసుపత్రికి చేర్చారు. అతనికి స్పృహవచ్చింది. ఆమె ముఖం చికిత్సపొందింది. ఆ విషాద సంఘటనకు ఖాయంగా ఆమె ముఖంమాత్రం నల్లగా భయంకరంగా మారిపోయింది.

కొద్దిరోజుల తర్వాత గోపాలం నుంచి వుత్తరం వకటి పావనికి తెచ్చి యిచ్చాడు కాంతయ్య. ఆమె చదువుకుంది.

'పావనమ్మగారికి నమస్కారములు - మీరు చేసిన ఘోర మయినపని నేను తెలుసుకోగలిగాను. మీ అందాన్నిచూసి నేను భ్రమించానని మీరు అపోహపడి మానవత్వానికే తీరని అప చారం చేశారు. నేననుకున్నదల్లా వక జీవితం చిగిరిస్తే చూద్దా మనే. అందుకనే మిమ్మల్ని వివాహంచేసుకుని వక కుటుంబాన్ని నిర్మిద్దామనుకున్నాను ... ఇప్పుడయినా నేను మనసుల్ని ప్రేమించటం మరచిపోలేదు. మీ జీవితం నాతో కలిసి సుఖ పడితే నేను అందుకని అర్రులు చాచేవాడినే...ఇప్పటికయినా నన్ను మానవత్వాన్ని చూడటానికి ప్రయత్నించే సంస్కరణాభి లాషిగా గుర్తించి, రంగులనుచూసి భ్రమించే పశువునుగాదని మీరు గ్రహించగలగాలని నా ప్రార్థన...మీరు అంగీకరిస్తే... యిప్పటికీ నేను సిద్ధంగానే వున్నాను...మీ ముఖంలో రంగు 'నా హృదయంలోరంగును మార్చలేదు.

గోపాలం'

ఆమె ఆ వుత్తరాన్ని చించి దూరంగా పారేసింది. కాంతయ్య మాట్లాడకుండా అదే సమాధానంగా తీసుకుని బయటకు పోయాడు.

'ఏం నాన్నా... నువ్వుకూడా నామాటను నమ్మటం లేదా...' అంది పావని.

'నమ్మకేమమ్మా...అతను యివ్వమంటే యిచ్చాను... నీ మనస్సును కష్టపెట్టటం గాదమ్మా నా ఉద్దేశ్యం...' అన్నాడు కాంతయ్య. పావని మాట్లాడలేదు. కాంతయ్య బాగా ఆలోచించి బయటకు వెళ్ళిపోయాడు.

పావని ఆ రాత్రంతా నిద్రపోలేదు. గోపాలాన్ని సరిగ్గా అర్థంచేసుకోలేక పోయాననే బాధ ఆమెను వేధిస్తునే వుంది. ఆమె యింకో బాధ ఏమిటంటే 'గోపాలం తనను అర్థంచేసుకోలేక పోయాడుగదా!' అని. జీవితంలో సంఘటనలు మనుష్యులతో చెలగాటం చేస్తున్నట్లు తోచింది. ఆమెభర్త కళ్ళముందు కట్టినట్లు కనిపిస్తున్నాడు. ఆమెను ఆహ్వానిస్తున్నాడు. తెగిన తాడును ముడివేయమంటున్నాడు. పావని ఎంతగానో కలవరించింది.

తెల్లవారుజామున లేచి తులసికోటలో దీపం వెలిగించింది. ఇంట్లో వున్న నగలూ ఆభరణాలూ ధరించింది. ముఖాన కుంకుమ మెత్తుకుంది. ఇంట్లో చప్పుడవుతుంటే కాంతయ్య మేలుకునే కదలలేదు. రోజూ కార్యక్రమం అతనికి అలవాటయిపోయింది. కొద్దిసేపట్లోనే దభాలుమని పెద్దపెట్టున చప్పుడు కావటంతో దొడ్లోకి పరుగెత్తుకుంటూ పోయాడు. అతను అను

కున్నంతా జరిగింది. పావని నూతిలో పడింది. కాంతయ్య కేకలు వేశాడు. నూతిలో దిగాడు. వరలుచిక్కలేదు. వచ్చినవాళ్లలో కొంతమంది నూతిలోకి తాళ్లుదించారు. పావని బయటకు వచ్చింది.

ఆమె వంటిమీద వక్క నగకూడా ఆమెను విడిచిపెట్ట లేదు. ముఖంపగిలి నెత్తురు స్రవిస్తూ నీటిలో కుంకుమ కడుక్కుపోయిన లోపాన్ని తీరుస్తుంది. పావనిని ప్రాణంగూడా విడిచి పెట్టలేదని డాక్టరు వచ్చిందాకా తెలియలేదు. ఆరిపోయే దీపానికి వచ్చిన వెలుగులాగా ఆమెలో చైతన్యం కలిగింది. పెదవులు కదలినాయి.

'పో...తు...న్నా...నాన్నా ... ఆయనతో గూడా చెప్పు...' అని ముఖం వాల్చేసింది. కాంతయ్య కొయ్యమాదిరి కూలబడిపోయాడు. అప్పటికిగాని కబురంది రాలేదు గోపాలం. కాంతయ్య భోరుమని ఏడుస్తూ గోపాలాన్ని కావలించుకుని 'నీతోగూడా చెప్పిపోయింది...' అన్నాడు. గోపాలం ముఖం వివర్ణమై పోయింది. ఆమె మీదపడి 'నన్ను విడిచిపెట్టి పోయావా పావనీ...' అంటూ గుండెలు సడలిపోయేట్లు రోదించాడు.

పసుపు కుంకుమలతో పావని బయలుదేరింది. కాంతయ్యని గోపాలాన్ని ఎవరూ ఆపలేకపోయారు. సందు చివరదాకా వచ్చిన తర్వాత ఆకొనలో యిద్దరూ నిలబడ్డారు. పావని భర్త దగ్గరకు మేళాలతో పోతున్నట్లువుంది.

గోపాలం కాంతయ్య చేతులు పట్టుకుని 'పావని చెప్పింది నిజంలాగానే వుంది...నేను ఎంతకాలంనుంచో వెతుక్కుంటూ

రాబోకపోతే పావని పోతుంటే నాకంత బాధెందుకుంటుంది... నేనూ పావని దగ్గరకే పోతాను...యిక్కడుండలేను...' అని కాంతయ్యను వదిలిపెట్టేసి పోబోయాడు. కాంతయ్య అతన్ని పట్టుకున్నాడు. 'చూడు గోపాలం...నువ్వుగూడా పావని లాగా నేలయిపోదామనా...నిన్నాసించిన స్త్రీ యింకొకతె మళ్లీ యిలా అయిపోవాలసిందేనా... ఈ విషవృత్తం అంతమయ్యే దేనాటికి ..నిన్ను చేసుకుందా మనుకుంటున్న పార్వతిని పెళ్లి చేసుకో...నన్నుగూడా ఎవరయినా పెళ్ళి చేసుకోవటానికి సిద్ధపడితే నేనూ పెళ్లి చేసుకుంటాను...' అన్నాడు. అతనిలో అంతనిశ్చలత ఆ విషాద వాతావరణంలో ఎలావచ్చిందో ఎవరికీ తెలియలేదు. గోపాలం ఆమాటలు వినదలచుకోలేదు. అతన్ని విదిలించుకుని పావనివైపు పరుగెత్తుకు పోయాడు. కాంతయ్య కుప్పగా కూలబడిపోయి 'నన్నుమట్టుకు యిక్కడ వంటరిగా ఎందుకు వదిలేశావు భగవాన్...నన్ను కూడా నీ దగ్గరకు తీసుకుపో...' అంటూ అరిచాడు. అతన్ని భగవంతుని దగ్గరకు తీసుకు పోవటానికి ఎవరూరాలేదు. ఏవరో యిద్దరువచ్చి అతన్ని లేపి భగవంతుని కవాటందాకా తీసుకువెళ్లారు.



## కంచి వాసుదేవరావు

జననం 1930. స్వస్థలము మచిలీపట్నం. అచ్చుటి హిందూకళాశాల, విశాఖపట్నంలోని ఆంధ్ర వైద్యకళాశాలలో విద్యాభ్యాసం చేశారు. కొన్నాళ్లు ఫార్మసిస్టు ఉద్యోగము - ప్రస్తుతం కృష్ణాపత్రిక ఉపసంపాదకత్వము నిర్వహిస్తున్నారు.

వీరు వ్రాసిన "ఆంధ్రాభ్యుదయము" అనే గ్రంథానికి తెలుగు భాషాసమితివారి బహుమతి 1955 లో డా. రాజేంద్రప్రసాద్‌చే యివ్వబడినది. పత్రికలకు 1949 నుండి కథలు వ్రాస్తున్నారు. రేడియో నాటికలు వ్రాయడంలో సిద్ధహస్తులు.

సాహిత్య సంస్థలలో పాల్గొనే అభిలాష మెండు. మచిలీపట్నంలోని తెలుగుసాహితీ సమితికి ప్రస్తుతం సంయుక్త కార్యదర్శిగా పనిచేస్తున్నారు.

సాంసారిక యితివృత్తాలు తీసుకుని, అందలి ఒడుదుడుకులకు చక్కని కల్పనచేసి, పరిష్కారం కూడ సూచించడం వీరి రచనల్లోని ప్రత్యేకత.

★

# భిన్న దృక్పథాలు

## 1

సంధ్యాకాంతులు పశ్చిమాకాశాన్ని అలముకున్నాయి. కిటికీలోంచి ఆ పశ్చిమాకాశము వంక చూస్తూ జానకి పరధ్యాన్నంగా నిలబడిపోయింది. ఆమెలో ఆందోళన— పైకి చెప్పుకోలేని ఆందోళన— అణచిపెట్టుకోలేని ఆందోళన— ఆమె హృదయమంతా ఆవరించి కల్లోలపరుస్తోంది.

"జానకీ! యీ చీర బాగుందా?" అంటూ అమితోత్సాహముతో లోపలికి వచ్చాడు వెంకటరావు.

జానకి ఆ చీర వంక సరిగ్గా చూడనైనాలేదు. వెంకట్రావుకి జవాబు-చెప్పనయినా చెప్పలేదు— ఈ ప్రవర్తన చూసి వెంకట్రావు నిరుత్సాహపడ్డాడు. అయినా దాన్ని అణచుకొని "నలభై అయిదు రూపాయలు. ఈ రంగు నీ వంటికి బాగుంటుందని తెచ్చాను... నీకు నచ్చలేదా!" అని అడిగాడు.

"ఇప్పుడు చీరల కేంతక్కువ?" అంది జానకి ముఖము మాడ్చుకుంటూ.

"ఏదో సరదాపడి తెచ్చాను." పోనీలే సినిమాకి వెళ్దాము తయారు కా" అన్నాడు వెంకట్రావు లేని వుత్సాహము తెచ్చుకుంటూ.

"నాకు వంట్లో బాగుండలేదు. కావాలంటే మీరు వెళ్లండి" అంది జానకి మరింత పుల్లవిరుపుగా !...

ఈ మాటలకి వెంకటరావు పూర్తిగా నీళ్లుకారిపోయాడు. ఆమెకెంతో సంతోషము కల్గించాలని, ఆమె చిరునవ్వు నవ్వితేనే చాలునని, చల్లని క్రీగంటి చూపు చూపుతే చాలని, మనసిచ్చి పలకరస్తే చాలని ఎంతో ప్రయత్నిస్తాడు. కాని ఆమె తనని విదలించివేస్తుంది. నూతన దాంపత్య జీవితపు తొలిదినాలలో వుండవలసిన వుత్సాహము ఆమెలో ఏమాత్రమూ కన్పించదు. కాపురానికి వచ్చి పట్టుమని పదిరోజులు కాలేదు. ఎందుకు తన పట్ల యీ విముఖత్వము ? ఆమెకి తనేం అపకారము చేసాడని ?

"జానకీ ! ఏమి చేసానని యీ కోపము ! నిన్ను శత విధాల సంతోష పెట్టాలనే ప్రయత్నిస్తున్నాను. కారణం ఏమిటో చెప్పరాదూ !" అన్నాడు జాలిగా.

ఆ మాటలు విని జానకి చలించింది. తన ప్రవర్తనవలన అతనికి చాల బాధ కలుగుతోందని తెలుసు. కాని తనేం చెయ్యగలదు ?...తన జీవితములో ఆశించిన ఆనందము కరువయిపోయింది. కారణం చెపుతే ప్రయోజనం లేకపోగా అతన్ని మరింత బాధపెట్టడము అవుతుంది.

"ఎందుకంత దిగులుగా వున్నావు !...చెప్పవూ!——" అంటూ ఆమె రెండుచేతులూ పట్టుకున్నాడు. అతనిచేతులమీద ఆమె వెచ్చని కన్నీరు పడింది. "ఏడుస్తున్నావా !——తప్పు కాదూ !——ఎందుకు ! అమ్మమీద దిగులా" అయోమయముగా అడిగాడు వెంకట్రావు.

ఆమె అడ్డముగా తలవూపింది.

"మరి ? చెప్పవూ !" అతను చాలా ప్రాధేయ పూర్వక ముగా అడిగాడు.

ఆమె తలవంచుకు పెదవికొరుక్కుంటోంది. కాని ఏం జవాబు చెప్పలేకపోయింది. బలవంతాన్న పెల్లుబికివస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటోంది. అతను ఆమె చుబుకము చేతపట్టు కొని ముఖము పైకెత్తి చూశాడు. ఆమె కళ్ళనిండా నీళ్ళు— "దయవుంచి నన్ను ముట్టుకోకండి" అంది ఆమె ప్రయత్నము మీద. ఇదే జానకి యిచ్చిన జవాబు. వెంకట్రావు తెల్లబోయి చెయ్యి తీసివేశాడు. ఏం మాట్లాడలేదు. మ్లానవదనముతో యీజీచైరులో కూలబడి పోయాడు. మనసుని అనేక భావపరం పరలు ఆక్రమించుకుంటున్నాయి. జానకి ముఖము త్రిప్పుకుని కూర్చుంది. కాసేపాగి వెంకట్రావు చాల హీనస్వరముతో "జానకీ ! జరిగినదానికి క్షమించు. నేను వక్క ప్రశ్న వేస్తా. దయవుంచి మర్మము విడిచి చెప్తావా ?" అన్నాడు.

జానకి అతని ముఖములోకి ఏమిటన్నట్టు చూసింది.

"నువ్వు నన్ను ప్రేమించడము లేదా ?"

ఆమె మాట్లాడలేదు. ముఖము తిప్పుకుని కళ్ళు తుడుచు కుంటోంది.

వెంకట్రావు ఒక దీర్ఘనిశ్వాసము విడచి "నేను అను కున్నంతా అయింది. యీ పదిరోజులలో నీమనసుని అర్థము చేసుకుని నిన్ను తృప్తిపరచాలనే ప్రయత్నిస్తున్నా. కాని, నీ మీద ఎటువంటి అత్యాచారము చెయ్యలేదని గుర్తించేవుంటావు.

పోనీ భర్తగా కాకపోయినా నీ ఆత్మీయునిగా భావించి నీ హృదయవేదన చెప్పు. నీ కీవివాహము యిష్టములేదా! నువ్వు మరెవరినయినా ప్రేమిస్తున్నావా ?"

"నన్ను బాధపెట్టదల్చుకున్నారా !" అంది జానకి.

"అది నా వుద్దేశ్యము ఏనాటికీ కాదు. నీకు చేతనయిన సహాయము చేయవలెననే నా తాపత్రయము. నువ్విలా నీళ్లు కారిపోవడము నాకిష్టములేదు. నీ కన్నీరు నేను చూడలేను... చెప్పు నేను నీ ఆత్మీయుడిని... నిస్సంకోచముగా చెప్పు... నీ కీ వివాహము యిష్టములేదా !"

ఈ వాక్యాలు వింటుంటే ఆమెలో యిన్నాళ్ళనుంచీ పేరుకుపోయిన దుఃఖము కరగిపోనారంభించింది. ఇంతవరకు అతి బలవంతాన్న అణచుకుంటున్న హృదయవేదనని యింక దాచుకోలేకపోయింది. "క్షమించండి యీ వివాహము నా కిష్టములేదు. అంటే మీరు తగరనికాదు... నేను మరొకర్ని ప్రేమించాను" అంది జానకి.

"ఎంత అన్యాయము!... నా కీ సంగతి తెలియనే తెలియదు. నాతో వివాహము నీ కంగీకారమే అని అనుకున్నాను. నీ కనంగీకారమని ఏ మాత్రము తెలిసినా నేను అంగీకరించేవాడిని కాదు సుమా !..." అన్నాడు.

"నిజముచెప్పి మీకు కష్టముకల్గించానా ?" అంది జానకి.

"లేదు జానకీ!... మనసులోవున్న సంగతి నిర్మొహామాటముగా చెప్పావు. చాల సంతోషము. అయితే మీ వాళ్ళకి నీ అనంగీకారము తెలపలేదా !..."

"తెలిపాను... ఏడ్చాను... మొత్తుకున్నాను... కాని మా నాన్న చండశాసనుడు. ఆయనముందు నేను అశక్తురాలి నయిపోయాను."

"చదువుకున్న దానివి...యిష్టలేదని ఏడ్చి మొత్తుకోవడం తప్ప మరేంచెయ్యా లేకపోయావా ?" అన్నాడు వెంకట్రావు.

"అంటే మీ వుద్దేశ్యము ?" అంది జానకి కొంచెము ఉడుకుమో త్తనముతో.

"నువ్వు ఎవరినో ప్రేమించానన్నావు. అతనూ నిన్ను ప్రేమించా డన్నావు. యీ యిష్టములేని పెళ్ళి జరుగుతుంటే మీరిద్దరూ ఏం చెయ్యగలిగారు ?" వెంకట్రావు సూటిగా ప్రశ్నించాడు.

"ఏంచేస్తేనేం నెరవేరనప్పుడు? అమ్మకీ నాన్నకీ యీపెళ్ళి ఏమాత్రము యిష్టములేదని ఎన్ని విధాలో చెప్పాను. బ్రతిమాలాను. బెదిరించాను. కాని యీపెళ్ళి ఎలాయినా జరిగితీర వల్సిందే" అని మానాన్న శాసించాడు. నేను శేఖర్ పెళ్ళి వారమురోజులు వుందనగా ఒక రాత్రి పారిపోవాలని నిశ్చయము చేసుకున్నాము. అల్లాగే పారిపోయి స్టేషనుకి వచ్చాము. కాని ఆనాడు దురదృష్టవశాత్తూ మా ట్రైను రెండుగంటలు లేటు. ఇంతలోకే ఒక రాత్రివేళ ఇంట్లో నేను కనబడక పోయేసరికి నన్ను వెదకుకుంటూ మానాన్న వకవైపు, మా అన్నయ్య వకవైపు వెళ్ళారు. మానాన్న సరాసరి స్టేషనుకే వచ్చాడు. సరే యిక చెప్పేందుకేముంది? పట్టుబడ్డాము. మా నాన్న గంభీరముగా "తిరిగివచ్చేయి" అన్నాడు. నేను ఎదురు మాట్లాడ

లేక పోయాను. అంతమంది జనములో ప్రతిఘటించి అల్లరిపడ లేక పోయాను. ఒక పిల్ల లేచి వచ్చింది. తీసుకు వెళ్ళడానికి పెద్దవాళ్ళు వచ్చారని తెలియగానే ఎంతగొడవ జరుగుతుందో ఎంతమంది మూగి ఎంత విడ్డూరముగా వూహించుకుంటారో ఆలోచించండి. అటువంటి అవమానాన్ని ఎదుర్కోలేక మా నాన్న వెనుక వచ్చేశాను. ఇక ఆరోజునుంచి నామీద నిఘా ఎక్కువయింది. ఎక్కడికి వెళ్ళినా ఒక కంట నన్ను కనిపెడ్తూనే వుండేవారు. ఆఖరికి ఆత్మహత్యయినా చేసుకోలేకపోయాను."

"ఎంతపని జరిగింది ? నా కివేం తెలియనే తెలియవే !" అన్నాడు వెంకట్రావు సానుభూతిగా.

"మీకేకాదు ! యీ వార్త మా యింట్లో పెద్దవాళ్ళకి తప్ప మరెవ్వరికీ తెలియదు. మానాన్న చండశాసనుడు. సరే యిక చెప్పేందుకేముంది ?— నా ఖర్మ యిల్లా కాలింది."

"నన్ను పెళ్ళిచేసుకోవడమువలన నీ కర్మకాలింది అనుకుంటున్నావా జానకీ!" అతను కొంచెము బాధగా.

"అబ్బే ! అదికాదు నా వుద్దేశ్యము" జానకి సర్దబోయింది.

"సరే ! జరిగినదానికి ఏం చెయ్యగలము ? నీకు జరిగిన అన్యాయములో తెలియకుండా నేను పాలు పంచుకోవలసి వచ్చింది... అందుకు నన్ను క్షమించు. ఇప్పుడు గతమంతా ఒక స్వప్నముగాభావించి నన్ను ప్రేమించలేవా ? జానకీ!"అన్నాడు.

"అసంభవము ! స్త్రీ వకసారి ఒక పురుషుడికి అర్పించిన హృదయము మరొకరికి అర్పించలేదు. ఇచ్చినట్లు కన్పిస్తే అది వట్టి బూటకము" అంది జానకి.

"అయితే నీ ప్రేమకి తగనా నేను ?"

"సూర్యుడిని చూసి 'కలువలు వికసించనంతమాత్రాన్న సూర్యుడికి ఏంలోటు చెప్పండి ?" అంది జానకి.

వెంకట్రావు వెళ్లి కిటికీ వూచలు పట్టుకుని నుంచున్నాడు. అప్పుడే వస్తున్న వెన్నెల అతని ముఖముమీద అస్పష్టముగా పడ్తోంది... అతని హృదయము ఛిన్నాభిన్నమయింది. తన ఆదర్శాలు ఏమిటి ?... చివరకు తనకు లభించినదేమిటి ?... తను కన్న కలలు ఎట్టాటివి ?

వెంకట్రావు చాల అభ్యుదయభావాలు కలవాడు. కొన్ని స్థిరమయిన ఆదర్శాలు గలవాడు. తను నమ్మిన ఆదర్శాలకోసము ఏ త్యాగానికైనా సిద్ధపడేవాడు.

తన తండ్రి లంచాలు పుచ్చుకుని ఆ డబ్బుతోనే తనకి చదువు చెప్పిస్తున్నాడని తెలుసుకుని చదువు మానుకుని వుద్యోగములో ప్రవేశించాడు. ఒక కంపెనీలో పనిచేస్తూ యజమాని తప్పుడు లెక్కలు వేయమన్నందుకు ఆ వుద్యోగానికి రాజీనామా యిచ్చాడు. విశాఖపట్నములో ట్యుటోరియల్ కాలేజి పెట్టుకుని ఏదోవిధముగా జీవితము గడుపుతున్నాడు.

వెంకట్రావుతండ్రికి జానకి తండ్రికి కొద్దిపాటి పరిచయము లావాదేవీలు వుంటూవుండేవి. ఆ సందర్భములో ఒకటి రెండు సార్లు వెంకట్రావు జానకి యింటికి వెళ్లాడు. అక్కడ అతను జానకి ఆ యింట్లో ఆమె నడచుకునే తీరు అతన్ని ముగ్ధుని చేసాయి. అయితే జానకి తండ్రి సీతారామయ్యగారు వచ్చి మా అమ్మాయిని చేసుకుంటావా అని అడిగేవరకు వెంకట్రావుకి

ఆ తలపే కలుగలేదు. స్త్రీకి కూడ స్వంత అభిప్రాయాలు వుంటాయని వాటిని ఆదరించి గౌరవించిననాడే జీవితము సుఖ ప్రదముగ గడుస్తుందని అతను విశ్వసించేవాడు. సీతారామయ్యగారు వచ్చి అడిగిన రోజున వెంకట్రావు వేసిన మొదటిప్రశ్న "మీ అమ్మాయికి యిష్టమేనా!" అని... దానికి "ఏం నీకేం లోటని యిష్టము లేకపోవడానికి" అని అన్నా రాయన. ఆ మాట అబద్ధమవవచ్చని వెంకట్రావుకి తట్టలేదు. నిజానికి తనకేం లోటు?... ఎంతమంది తనని అభ్యర్థించారుకారు! కాని కొన్ని ఆదర్శాలని నమ్ముకున్న తనకి వివాహ జీవితములో ప్రతిబంధకమవుతుందని యిదివరకు వచ్చిన సంబంధాలని కాల దన్నాడు. జానకిని చూసినదాన్నిబట్టి, ఆమె తన జీవితములో అడుగుపెడ్తే, తన జీవితలక్ష్యాలు నెరవేర్చుకోవడము సుగమ మవుతుందని విశ్వసించాడు. అందుకనే వప్పుకున్నాడు. వెంక ట్రావు వప్పుకోవడములో సీతారామయ్యగారు రెండువిధాల విజయము సంపాదించాడు. జానకీ శేఖర్ ల ప్రేమ భగ్నము చెయ్యడము, కట్నము లేకుండా అల్లుడిని సంపాదించడము.

"స్త్రీ ఒకసారి ఒక పురుషుడికి అర్పించిన హృదయాన్ని మరొకరికి అర్పించి ప్రేమించలేదు. ఇచ్చినట్లు కన్పిస్తే అది వట్టి బూటకము" అన్న జానకిమాటలు చెవుల్లో మార్మోగుతున్నాయి. నిజము! జానకి నిర్మొహమాటముగా తను నమ్మిన సత్యాన్ని చెప్పింది. కాని తను యిప్పుడు ఏం చెయ్యాలి! జానకికి జీవి తములో ఓ అన్యాయము జరిగింది. అందులో తెలియకుండా తనూ పాలు పంచుకున్నాడు. తెలియకుండాచేసిన యీ అన్యా

యానికి ఏదయినా పరిహారముందా ?" ఇదే వెంకట్రావుని వేధిస్తున్న ప్రశ్న.

అతను అల్లాగే కిటికీ వూచలని పట్టుకుని నుంచున్నాడు. వెన్నెల యిప్పుడు మరింత స్పష్టముగా అతని ముఖముమీద పడ్తోంది. అతను మనసులో ఎంత బాధపడ్తున్నాడో జానకికి తెలియిక పోలేదు. అతని మంచితనము, కలుపుగోలు తనము అభిమానముచూస్తే హృదయము ద్రవించిపోతోంది. నిజమే అతన్నిచూస్తే తనకి జాలిగా వుంది. కాని తనేం చేయగలదు ? తన హృదయము మరొకరికి అర్పించింది ? అదికాదని ఏం తెలియనట్లు వెంకట్రావుతో కాపురము చేస్తే, దీనికీ వ్యభిచారానికి ఏమిటీ తేడా !—ఛా! అసలు తను చచ్చిపోయివుంటే యిన్ని సమస్యలు వుత్పన్నమయ్యేవి కావు. ప్రేమించిన మనిషా కాకుండా పోయాడు. కట్టుకున్నభర్తకా తీరని మనఃక్లేశము కలుగ చేసింది. ఛీ ! తను చచ్చిపోగలుగుతే ఎంత బాగుండును? దుఃఖావేశముతో ఆమె లోపలికి వెళ్ళి మంచముమీద బోర్లపడుకుని తలగడాలో తలదూర్చి వెక్కి వెక్కి ఏడ్చింది.

"జానకీ !" నెమ్మదిగా పిలిచాడు వెంకట్రావు.

ఆమె లేచి కూర్చుని అతనివంక తిరిగింది.

వెంకట్రావు ప్రక్కనే పెట్టెమీద కూర్చుని "నీ దుఃఖగాథ విన్నాను. యిక ముందు ఏంచెయ్యాలో ఆలోచించావా?..."

ఆమె అతని ముఖమువంకే చూస్తూ కూర్చుంది.

జానకీ నా తత్వము నీకు తెలుసో తెలియదో. నేను ఎవరిమార్గానికి అడ్డుగా నిలబడను. తెలియకుండా నీదారికడ్డుగా వచ్చాను క్షమించు. తెలియచెప్పావు. అడ్డు తొలగిపోతాను.

"అంటే ఏమి చేస్తారు ?" అంది ఆమె గాబరాగా.

"లోకము దృష్టిలో మనము భార్యాభర్తలము. కాని దానికన్న ప్రధానమయినది మన అంతరాత్మ. నీ అంతరాత్మలో నాకు భర్తృస్థానము లేదని గమనించాను. ఒక్క విషయము అడుగుతాను చెప్పు. నీ మనసులో ఎవరిపై నయితే భర్తృభావ ముందో అతను నిన్ను స్వీకరించగలడన్న నమ్మకముందా ?" అన్నాడు.

నమ్మకముంటే ఏం ప్రయోజనము ?

"చెప్పానుకదా జానకీ ! నేను మీ దారినుండి తప్పు కుంటా !" అన్నాడు వెంకట్రావు గంభీరముగా.

"అంటే మీ వుద్దేశ్యము. ఏదయినా అఘాయిత్యము చేద్దామనా ? నేను పడ్తున్న బాధ చాలకనా ఈ రంపపుకోత" అంది ఆమె రుద్ధకంఠముతో.

లేదు జానకీ ! నేను ఎట్టి అఘాయిత్యము చేయను. యీ పెళ్ళికి ముందు దాదాపు మన మెవరమో తెలియదు. యికముందు అదే విధముగా ఎందు కుండకూడదు ? యీ స్వల్ప కాలము ఒక్క పీడకలగా భావించి నూతన జీవితము ఎందుకు ఆరంభించ కూడదు ?

"పరిహాసము చేస్తున్నారా ?" అంది.

లేదు. పరిహాసమని నీకు తోచవచ్చుకాని వున్నమాట చెపుతున్నాను. నావలన జరిగిన అన్యాయానికి తగిన ప్రాయశ్చిత్తము చేసుకోవాలనే నా ఆరాటము. చెప్పు జానకీ! ఆ శేఖర్ నిన్ను స్వీకరిస్తాడా!

జానకి ఏం మాట్లాడలేక పోతోంది.

మీ యుభయులూ ఒకరి నొకరు ప్రేమించుకున్నారు. నువ్వు వెళ్ళి అభ్యర్థిస్తే అతను నిన్ను స్వీకరించడూ ?

స్వీకరిస్తాడు. కాని ఏం లాభము ? లోకము ఏమనుకుంటుంది ? అమ్మా నాన్నా ఏమను కుంటారు ?

"లోకము ! అమ్మా నాన్నా" ఏమిటీ వెర్రికబుర్లు ? నువ్వు చేస్తున్నపని మంచిదని మనసారా నమ్మితే నువ్వు ఎవరికి భయపడ నవుసరములేదు. ఆనాడు నువ్వు శేఖర్ తో పారిపోదామనుకున్న రోజున వీటన్నిటి గురించి ఆలోచించావా ? నువ్వు సుఖముగా వుండడమే నాకు కావాలి.

జానకి తెల్లబోయి ఆమాటలు వింటోంది. అతని మాటలలో నటనకాని కపటముకాని లేదు. నిండు హృదయపు లోతులనుంచి వచ్చిన మాటలవి. తనపట్ల ఎందు కీ సానుభూతి ? ఇటువంటి పరిస్థితులలో ఏ పురుషుడయినా యిల్లా ప్రవర్తిస్తాడా? తను అతన్ని ప్రేమించడము లేదని, తన హృదయము మరొకరికి అర్పితమయినదని తెలుసు. తెలిసికూడా అతనిలో ఈర్ష్యా ద్వేషము లేకపోగా అనన్య సాధ్యమయిన క్షమ కనిపిస్తోంది. ఎంత విశాల హృదయు డితను ?

"ఆలోచించుకో జానకీ! నీకు రెండే రెండు మార్గాలు... జరిగినదంతా స్వప్నముగా భావించి గతాన్ని మరిచిపోయి నాతో జీవితము గడపడానికి యిష్టపడ్డానసరే! ప్రయత్నిస్తే ఏదీ అసాధ్యముకాదు!... లేదా జీవితములో స్త్రీ వకరినే ప్రేమిస్తుంది అంటావు! అతనితో ఆసించిన జీవితము గడపినాసరే. ఏం చేసినా మనఃస్ఫూర్తిగా చేయి" ఇదే నీకు నేను యివ్వగలిగిన సలహా.

"మనఃస్ఫూర్తిగా అంటున్నారా?" జానకి యింకా అనుమానము తీరక ప్రశ్నించింది.

"అవును" అతను దృఢస్వరముతో అన్నాడు.

జానకి ఆలోచిస్తోంది. వెంకట్రావు చేయెత్తి నమస్కరించ దగ్గవ్యక్తే. కాని తను అతన్ని ప్రేమించలేదు. తన హృదయాన్ని ఏనాడో శేఖర్ కి అంకితముచేసుకుంది. దాన్ని మరల్చుకోలేదు.

"ఏ మార్గము ఎన్నుకున్నావు జానకీ!" తిరిగి ప్రశ్నించాడు.

"క్షమించండి. సూర్యుడినిచూసి కలువలు వికసించవని యిందాకే చెప్పాను!" అంది జానకి.

"మంచిది. అల్లాగేకానీ జానకీ!" అన్నాడు వెంకట్రావు ఒక దీర్ఘనిశ్వాసము విడుస్తూ.

## 2

ఈ నిర్ణయము గురించి ముందర శేఖర్ కు వుత్తరము ద్వారా తెలియపర్చాలని అనుకుంది జానకి. "కాని వుత్తరము

దేనికి, నువ్వే వెళ్ళి అన్ని సంగతులు చెప్పరాదా ?" అని వెంక ట్రావు అన్నమీదట స్వయముగా వెళ్ళిపోవడానికే నిశ్చయించుకుంది.

మర్నాడు బట్టలు సర్దుకుంటోంది. రైలుకి టైము కావలసి వచ్చింది. జట్కాబండి వీధిలో సిద్ధముగా వుంది.

"జానకీ !" అని పిలిచాడు వెంకట్రావు.

ఆమె తల ఎత్తి చూసింది. అతని చేతిలో రిస్టువాచీ వుంది. దాన్ని చూసేటప్పటికి జానకి హృదయము కలుక్కుమంది.

దాన్ని సీతారామయ్యగారు అల్లుడికని కానుకగా పెళ్లినాడు యిచ్చారు.

"ఇది శేఖరానికి యిచ్చేయి. నేను ప్రెజంటు చేసానని చెప్పు" అన్నాడు వెంకట్రావు.

"ఆ వాచీ యిచ్చేస్తున్నారా ?" జానకి బాధగా అంది.

అవును! మామగారు... కాదు క్షమించు మీ నాన్నగారు అల్లుడికని యిచ్చారు. కాని నా కా అర్హత లేనప్పుడు దగ్గర వుంచుకోవడము భావ్యముకాదు" అన్నాడతను.

జానకి కా మాటలు చెళ్ళున కొట్టినట్లయింది. కాని ట్రైనుకు టైమయిపోతోంది. ఆ రిస్టువాచీని యంత్రములా తీసుకుని పెట్టెలో పెట్టుకుంది. బండి ఎక్కేముందు అతని రెండు కాళ్లూ కళ్లకద్దుకుని దుఃఖావేదనలో బండి ఎక్కింది. వెనకాల వెంకట్రావు సైకిల్ మీద బయలుదేరాడు. వెంకట్రావుని విడచివెళ్తుంటే ఎందుకు తనకింత దుఃఖము వస్తోంది ? ఆ ప్రేమిత్రు

డిని వీడిపోతున్నట్టు ఎందుకు బాధపడ్తుంది? పెళ్ళి అయ్యేటంత వరకు వెంకట్రావుని ద్వేషించింది? యిప్పుడా ద్వేషము ఏమయింది? పదిహేను రోజుల్లో ఎల్లా యితను యింత ఆత్మీయుడు కాగలిగాడు? తను వెంకట్రావునికూడా ప్రేమిస్తోందా? అన్న ఒక అనుమానము తృటికాలము కలిగింది. కాని వెంటనే వెంకట్రావుపట్ల తనకి గౌరవము అభిమానము వున్నాయి కాని ప్రేమ లేదు; తను ప్రేమించేది ఒకే వ్యక్తిని; అతనే శేఖర్ అని తిరిగి అనుకుంది.

రాజమండ్రికి సెకండ్ క్లాస్ టిక్కెట్టుకొని లేడీస్ కంపార్టుమెంటులో జానకిని కూర్చో పెట్టాడు. తను ఆపెట్టె ప్రక్కనే ప్లాటుఫారము మీద నిలబడ్డాడు. చీకట్లోకి అయోమయముగా చూస్తువున్నాడు. అతని హృదయము ఎంత వ్యధపడిపోతోందో ఆ భగవంతుడికి తెలియాలి. అతనికి తెలియకుండానే కళ్ళవెంబడి నీళ్ళు కారుతున్నాయి. దాన్ని తుడుచుకోవాలన్న ధ్యాసే అతనికి లేదు. జానకి అతని ముఖములోకి చూడలేక పోతోంది. అతనికి తీరని అన్యాయము చేసానన్న భావము ఎంత కాదనుకున్నా ఆమె హృదయాన్ని కలచివేస్తోంది.

బెల్లు కొట్టారు. గార్డు విజిల్ వూదాడు. "మీరు తిరిగి పెళ్ళి చేసుకోండి! చేసుకుంటేనే కాని నన్ను క్షమించినట్లు కాదు" అంది జానకి తల వంచుకునే.

"మళ్ళా యింకొకరి జీవితము నాశనము చేస్తానా?" అన్నాడు వెంకట్రావు. దానికి జవాబుగా జానకి ఏం చెప్పగలదు?

బండి కదిలింది. జానకి రెండుచేతులు ఎత్తి "సెలవు" అంది.

"నన్ను మరచిపోకు. నువ్విక్కడే వుండిపోకూడదూ. నిన్ను విడచి వుండలేను" అన్నాడు వెంకట్రావు ఆవేశములో. ఆ మాటలువిని తెల్లబోయింది. దాని భావము బాధ అర్థము చేసుకునేటంతలో రైలు వేగము హెచ్చింది.

బండిలో కూర్చున్నంతసేపు శేఖర్‌ను తిరిగి కలుసుకో బోతున్నానన్న వుత్సాహము ఆమెలో కన్పించలేదు. వెంకట్రావు ? అతని చివరిమాటలు తలుచుకుంటే తను మహాప రాధము చేసినట్లు అన్పిస్తోంది. యింటికి వెళ్ళి ఏం చెప్పాలి ? అందరూ ఏమనుకుంటారు ? యిక ముందు జీవితాన్ని ఎదురు కోవడానికి తనకి చాల ధైర్యసాహసాలు కావాలి.

## 3

వున్నట్టుండి వచ్చేసినజానకిని చూసి ఆమె తల్లి తండ్రి ఆశ్చర్యపోయారు.

"ఏమిటే యిల్లా వచ్చావు?" అని అడిగింది ఆవిడ ఆత్రుతగా.

దేనికి వచ్చానని చెపుతుంది ? నిజము చెప్పగలదా ? "ఆయనని కలకత్తాలో ఏదో కంపెనీవారు యింటర్వ్యూకి పిలిచారు. కలకత్తానుంచి వచ్చేటప్పటికి వారము రోజులు పడుతుందిట. ఒక్కర్తెనే విశాఖపట్నములో వుండడము దేనికని వారే నన్ను యిక్కడికి పంపారు" అంది జానకి.

ఆమాటలు నమ్మేశారు వాళ్ళు. తమఅల్లుడికి కలకత్తాలో పెద్ద వుద్యోగము కాబోతోందన్న వార్తవిని వాళ్ళు మురిసి పోయారు. దాన్ని చూస్తే జానకికి తనమీద తనకే చాల అసహ్యము కలిగింది. సాయంత్రమే శేఖర్ యింటికి వెళ్ళింది. కాని శేఖర్ వూళ్ళోలేడు. మర్నాడు సాయంత్రానికి కాని రాడని తెలుసుకుంది. ఆమర్నాడు సాయంత్రము స్నేహితురాల్ని చూసివస్తానని యింట్లో చెప్పి శేఖర్ యింటికి వెళ్ళింది.

"రా కూర్చో జానకీ! ఎప్పుడు వచ్చావు?" కుశల ప్రశ్నలు వేశాడు శేఖర్.

"ఇవాళే వచ్చాను. కులాసాగా వుంటున్నావా?" అడిగింది జానకి.

"ఆ కులాసాకేంలోటు! కావల్సినంత కులాసా! ఎల్లా వుంది నీసంసారము. మీఆయన నిన్ను బాగా చూస్తున్నాడా?"

ఆయనకేం! అటువంటివాళ్ళు నూటికి కోటికే వుంటారు. చేతులెత్తి దణ్ణము పెట్టవచ్చు" అంది జానకి.

తనఎదుట వెంకట్రావుని పొగడ్డము శేఖర్‌కి ఏమాత్రమూ నచ్చలేదు. వెళ్ళి పదిహేనురోజు లయిందో లేదో అప్పుడే అతన్ని అంత పొగడ్డము అతనికి చాల బాధ కలిగించింది. "మూడు ముళ్ళు పడగానే గడచినదంతా మరచి ఆడవాళ్ళు మారిపోతారు కాబోలు". అన్నాడు.

"మారేవాళ్ళు ఎప్పుడయినా మారతారు, పెళ్ళివరకు ఆగనే అక్కర్లేదు. ఇంతకీ ఆయిన గురించి నువ్వేమనుకుంటున్నావు?"

"ఇది మరీబాగుంది. మీ ఆయన గురించి నేనుచెప్పాలా?" అన్నాడు శేఖర్ ఉక్రోషముగా.

"నువ్వేమనుకుంటున్నావో నాకు తెలుసు. మన దారి కడ్డముగా నిలుచుని మన ప్రేమకి విఘాతము కల్పించినవాడని అనుకుంటున్నావు, అవునా ?"

"అయితే ఏమంటావు ?"

"కాని ఆయనఅటువంటివాడుకాడు. నేనెందుకువచ్చానో తెలుసా. ఇంట్లోచెప్పినట్లు మా ఆయన కలకత్తాకు ఇంటర్వ్యూకి వెళ్లలేదు. నీ కోసము వచ్చాను తెలుసా శేఖర్ !"

"నా కోసమా !" అని శేఖర్ ఆశ్చర్యముగా అడిగాడు.

"అవును వారే పంపారు." అంది

శేఖర్ మరీ ఆశ్చర్యపోయాడు.

"నేను అక్కడకు వెళ్ళినప్పటినుంచీ నన్ను సంతోష పెట్టాలని ఆయన శతవిధాల ప్రయత్నించేవారు. కాని నిన్ను ఎల్లా మరచిపోగలను ? నీ కర్పించిన హృదయాన్ని ఆయనకు ఎల్లా అర్పించగలను ! నా దుఃఖకారణము గురించి తరచితరచి అడిగారు. ముందు చెప్పకూడ దనుకున్నాను. కాని ఆయన ప్రదర్శించే ఆత్మీయతను అనుభవించాక లోపల దాచుకోలేక పోయాను. వున్న సంగతి వారితో చెప్పాను. జరిగిన అన్యాయానికి ఆయన ఎంత బాధపడ్డారో నువ్వు వూహించలేవు. నాకు యిష్టము లేదని ఏ మాత్రము తెలిసినా యీ వివాహము జరిగి వుండేది కాదని ఆయన నొచ్చుకున్నారు."

"అందుకని నిన్ను వెళ్ళకొట్టాడా ఆనీచుడు ?"

"నీచుడు- చాల పెద్దమాట అనవసరముగా ఉపయోగిస్తున్నావు. ఆయిన రెండే రెండు ప్రశ్నలు వేశారు. -గతాన్ని మరచిపోయి తనతో సంసార జీవితాన్ని గడిపినాసరే లేదా నిన్ను చేరినాసరే" అని

"అల్లాగా" అన్నాడు శేఖర్ ఆలోచనగా.

"అందుకని నేను నీదగ్గరకే వచ్చాను. నువ్వు నన్ను స్వీకరిస్తావని వచ్చాను. అంతరాత్మ అంగీకరించని యీ వివాహ బంధము తెగిపోయినట్లే. ఏమంటావు శేఖర్ ?" జానకి ఆత్రుతగా ప్రశ్నించింది.

శేఖర్ కాసేపు ఆలోచించాడు.

"ఏమంటావు శేఖర్ !" తిరిగి రెట్టించింది.

"నువ్వు పెద్దపొరబాటు చేశావు జానకీ !" అన్నాడు.

జానకి నిర్ఘాంత పోయింది. ఈ జవాబే వస్తుందని ఏమాత్రమయినా తెలిసివుంటే వెంకట్రావుని వదలి వచ్చేదే కాదేమో! "నేనా! పొరపాటుపడ్డానా! నీమీది ప్రేమ మరల్చుకోలేక పోవడమే దోషమా !" అంది ఆవేశముతో జానకి.

"గడచిన గాథలు త్రవ్వుకుని ఏంలాభము జానకీ ! ఏనాడయితే నీకు అతనితో యీ వివాహము జరిగిందో ఆనాడే మన ప్రేమ ఆఖరు. నాడే నువ్వు పరస్త్రీవి. ఒకసారి విరిగినపాలు కలవవు జానకీ!"

"అదేమిటి అంత తొందరగా ప్రేమ నశిస్తుందా? ఒకసారి ఏర్పడ్డప్రేమ నశించదని నేను భావించాను."

"నశించకపోవచ్చు. కాని రూపాంతరము చెందవచ్చు. నీకు మూడుముళ్లు పడేవరకు నిన్ను పొందాలని ప్రయత్నించాను. కాని నువ్వు మరొకరిభార్యవు కాక తప్పలేదు. ఇంక వున్న పరిస్థితులని యథాతథముగా ఎదుర్కోవడమే మనము చేయవలసిన పని. బహుశః మనవివాహాము భగవంతుడికి సమ్మతము కాకవుండాలి. కాకపోతే ఆనాడు ట్రైను రెండుగంటలు లేటుకావడము, అప్పుడే మీనాన్న నిన్ను వెదకుకుంటూ రావడములో వున్న అంతరార్థము అదే!......నీమీద ప్రేమని మరువదల్చుకున్నాను. ఒకరి భార్యవయిన నిన్ను నేను స్వీకరించలేను."

"స్వీకరించలేవా! నేనే పొరబడ్డాను. నువ్వు నన్ను యింకా ప్రేమించగలవని, స్వీకరించ గలవని జరిగినదంతా స్వప్నముగా భావించి నన్ను ఆదరించగలవని వూహించి దైవస్వరూపుడయిన భర్తను కాదన్నాను."

"నువ్వు ఆవేశములోఅన్నా, నిజముగాఅన్నా సత్యము పలికావు. వెళ్లి అతని కాళ్లమీదపడి క్షమార్పణ అడుగు. అదే నీకిచ్చే సలహా!...మరోసంగతి నీకు చెప్పడము అప్రస్తుతము కాదు. నా వివాహాము స్థిరపడింది. యిదివరకు నిన్ను ప్రేమించినట్లే రాబోయే భార్యనికూడా మనోవాక్కాయ కర్మలా ప్రేమించ ప్రయత్నిస్తాను. జరిగినదంతా స్వప్నముగా భావించు. దయవుంచి నా దారికడ్డుగా నిలబడకు. ఆవేశ రహితముగా ఆలోచిస్తే నేను నిజమే చెప్పానని గుర్తించగలవు."

"అవును నేనే పొరబడ్డాను.! అందుకనే నా జీవితము సర్వనాశనము. యింక మళ్లా ఆయనకి నాముఖము ఎల్లా చూపను?..."అంటూ జానకి రెండుచేతుల్లో ముఖముకప్పుకుంది.

"ఏడ్వకు జానకీ!...ఏడ్చి ఏంలాభము?" అంటూ ఆమెని దగ్గరకు తీసుకోబోయాడు శేఖర్.

"ఆగు!" జానకి వురిమింది..."నన్ను ముట్టుకునే అర్హత నీకులేదు. శాస్త్రరీత్యా, న్యాయరీత్యా తను నాభర్తని తెలిసి కూడా నా కిష్టములేదని ఆయన నా వంటిమీద చెయ్యి వేయ లేదు. నువ్వా! పరస్త్రీనని తెలిసికూడా దగ్గరకు వస్తున్నావు... మీయిద్దరి తారతమ్య మిది... యిక నీముఖము చూడను!" అంటూ చివాలున బయటకు వచ్చింది.

తను ఆశించినదేమిటి ? లభించినదేమిటి ? తనకోసము ఎంతత్యాగము చేసిందో శేఖర్ గుర్తించలేదు. కేవలము మూడు ముళ్లు పడ్డాయన్న మిషతో శేఖర్ తనని నిరాకరించాడు. తన ప్రేమ మరొకరి మీద వుందని తెలిసికూడా వెంకట్రావు తనని క్షమించి స్వీకరించ సిద్ధపడ్డాడు. ప్రయత్నిస్తే అసాధ్యమేమీ వుండదు. ప్రేమని మరల్చుకోవచ్చు అని అభిప్రాయపడ్డాడు వెంకట్రావు. ప్రేమ నశించకపోవచ్చు, కాని రూపాంతరము చెందుతుంది. యివాళ ప్రేమస్వరూపము రేపు మారిపోవచ్చు అంటాడు శేఖర్. ప్రేమఅనేది అసలుమారనేమారదు. నశించదు. అని తను భావించింది— యిందులో ఏది సత్యము ?... పెళ్లానికి తనే పొరబడిందా?... పొరబాటుపడినా పడకపోయినా

వెంటనే వెళ్ళి వెంకట్రావుని క్షమార్పణ అడగడమే తన కర్త వ్యము. రాత్రి బండికే వెళ్ళిపోవాలని నిశ్చయించుకుంది.

ఇంటికి వెళ్ళేటప్పటికి వెంకట్రావు దగ్గరనుంచి వచ్చిన కవరు ఉత్తరాన్ని జానకి తల్లి యిచ్చింది. జానకి ఆత్రుతగా చింపి చదివింది.

జానకీ !

"ఈ వుత్తరము నీకు చాలా ఆశ్చర్యము కల్గించవచ్చు. నీ వద్ద సెలవు తీసుకోవాలనే యీ వుత్తరము వ్రాస్తున్నాను. నేను యీ రాత్రే ట్యుటోరియలు కాలేజి కట్టివేసి చాలదూరము వెళ్ళిపోతున్నాను. నేను ఎంత దూరముగా వుంటే అంత మీకు మంచిది. దేశముకాని దేశము, ఎరుగున్న మనుష్యులు ఎవరూలేని క్రొత్త ప్రదేశానికి నూతనజీవితము ఆరంభింప వెళ్ళిపోతున్నాను. ఏకాకి జీవితము నాకు క్రొత్తకాదు. చాల రోజులు ఏకాకిగానే బ్రతికాను. కాని మధ్యలో ఎండమావులనుచూసి అర్రులుచాచాను. అటువంటి పొరబాటు యింక ఎన్నడూ జరుగకుండా నేను జాగ్రత్తపడ్డాను. నువ్వు నాతో వున్నది పదిహేను రోజులయినా స్థిరసంకల్పమంటే ఎల్లా వుంటుందో నిరూపించావు. నీ స్థిర సంకల్పానికి నిన్ను అభినందిస్తున్నాను. ఎప్పుడయినా గుర్తుకు తెచ్చుకో ! అదే నిన్ను కోరేది. యీ వుత్తరము నీకు అందే టప్పటికి నేను చాలదూరము వెళ్ళివుంటాను. మరి సెలవు."

"అల్లుడు ఏమని వ్రాశాడే" అంటూ వచ్చింది జానకితల్లి.

ఆవిడని కౌగిలించుకుని జానకి భోరుమని ఏడ్చింది.

*

## కె. వీరభద్రశాస్త్రి

వీరి వయస్సు 30 సంవత్సరాలు. వీరు "ఉత్త రాషాఢ" అనే పేరుతోకూడా వ్రాస్తూంటారు. వీరు చాలా గద్య పద్య ఖండాలు రచించారు. శబరి (రూపకం), పరివేదన, తారుమారు అనే నాటకాలు వ్రాశారు. మార్క్‌ట్వేన్ వ్రాసిన టామ్‌సాయర్ సాహసకృత్యాలు నవలగా తెలుగులోకి అనువదించారు. నవ్యభారతి అనే పత్రికకు కొన్నాళ్ళు సహాయ సంపాదకులుగాను, బాలకా అనే పత్రికకు సంపాదకులుగాను పని చేశారు. ప్రస్తుత నివాసం రాజమండ్రి. రైల్వేలో ఉద్యోగం.

వీరి రచనలు హాస్య ధోరణిలో సాఫీగా ఉంటాయి. మధ్య తరగతి గుమాస్తా జీవితాలు చిత్రించడంలో వీరు ప్రవీణులు.

★

# ఆదినారాయణ ఫజిలు

అయిదుగంటలు కొట్టేసరికి ఆఫీసులో పని ఆపుచేయడం మొదలుపెట్టారు. ఆనాడు తాసీల్దారు క్యాంపులో వున్నాడు. అందుకనే యీ ప్రివిలేజి...ఫైళ్ల మహాసముద్రంలోంచి తల బైటికిపెట్టి గడియారంకేసి ఒకసారిచూచి 'హమ్మయ్యా!' అని నిట్టూర్పువిడిచి కుర్చీలో వెనక్కు జార్లపడ్డాడు L.D.C. ఆది నారాయణ, బి. ఏ. తను కూడా యింటికిపోతే!!! తాసీల్దారు గారు యింకా నాల్గురోజులదాకా రారు. ఈలోగా యీఫైళ్లు పూర్తిఅవవా??? ఏమైతే అవుతుందనే ధీమాతో, డ్రాయర్కు తాళంవేసి, కోటు తొడుక్కొని బయటకు నడిచాడు...ఎన్నాళ్లకు యిల్లాంటి సంధ్యాసమయం తాను చూడగలిగాడు!!! సూర్యోదయం చూసేరుగాని, సూర్యాస్తమయం చూడడం తన నాలుగేళ్ల సర్వీసులోనూ యిదే మొదటిసారి!!

ఇంత పెందరాళే యింటికివెళ్ళి ఏంచెయ్యాలి??? తను మామూలుగా ఏ రాత్రికోగాని రాననుకొని యింకా వంట ప్రయత్నం చెయ్యరేమో!! అథవా యింటికి వెళ్ళినా ఇవిలేవు, అవిలేవు, నాకు గుడ్డముక్కలులేవు అంటూ ప్రారంభిస్తుంది సతీమణి!! ఏమిటో యీ జీవితం?? తనతో చదువుకొన్నవాళ్లు చాలామంది పెద్ద హోదాలో వుంటున్నారు. అందాకా ఎందుకు!! కాపీకొట్టి ప్యాసయిన రామారావు బర్మాషెల్లో ఆఫీసు అసిస్టెంటు!!! ఎంతలేదన్నా నెలకి మూడువందలైనా

నని బాధపడ్డాడు. ఆ రూపాయి వుంటే నాల్గురోజులు కూరలు కొనుక్కోవచ్చు...ముఖ్యంగా పెరుగుబాకీ తీర్చవచ్చు !!

# 2

అది ఆదినారాయణ దురదృష్టంఅనండి... విధి అనండి... ఫజీలు పంపించిన మర్నాడు అతనికి జ్వరం తగిలి, యింతై అంతై చివరికి టైఫాయిడులోకి దింపింది. శిరస్థదారుగారు అతనిమీద జాలిపడి ఒక ప్రైవేటు డాక్టర్కు పరిచయం చేశారు. అసలు గవర్నమెంటు ఆస్పత్రి మందులతో రోగం మళ్లడంబదులు ఎక్కువ అయి, చివరకు అతని రక్తమాంసాలు హరించాయి. పాపం ! ఆదినారాయణ జబ్బునుండి తేరుకొనేసరికి జీవచ్ఛవంలా తను, మందులబాపతు రెండువందల రూపాయలకు డాక్టరు బిల్లు మిగిలారు...వూరినిండా అప్పులు...డాక్టరుగారి మనిషి రోజుకి పదిసార్లయినా కనపడివెళ్ళడం...శిరస్థదారుకూడా డాక్టరు బిల్లు త్వరగా యివ్వకపోతే తనకు మాట వస్తుందని కబురు చెయ్యడం.. ఇవన్నీ ఆదినారాయణను జబ్బునుండి తేరుకున్నా మానసికంగా కృంగ తీశాయి... జీవితం అంటే విసుగు పుట్టింది...ఆ టైఫా యిడులోనే తను 'హరీ' అంటే బాగుండును...వెంటనే అతనికి తన ముసలితల్లి, భార్య, యిద్దరు కొడుకులూ మనోవీధిలో కన పడ్డారు. తను చచ్చిపోతే, వాళ్ళు దీనంగా మొహం పెట్టుకొని తిండిలేక అల్లలాడిపోతున్నట్లుగా తోచింది...ఆ ఆలోచన రావ డంతో ఆదినారాయణ గజగజ వణికిపోయాడు...లేదు ! తను

బ్రతికి వుండాల్సిందే !!! ఈవేళ గాకపోయినా ముందైనా తనకు మంచి రోజులు రాక మానవు !!!

'సార్ ! టెలిగ్రాం !' అన్న పిలుపు వినడంతో ఆదినారాయణ హడిలిపోయి లేచి కూర్చున్నాడు. పెద్దకొడుకు టెలిగ్రాంకవరూ, ఒక కాగితం పట్టుకొచ్చి 'ఈ కాగితంమీద సంతకంపెట్టి యివ్వాలిట నాన్నగారూ!' అన్నాడు. బేజారెత్తిపోయిన గుండెతో. చేతులు వణికి పోతూవుంటే ఎల్లాగో సంతకంపెట్టి టెలిగ్రాం తీసికొన్నాడు...ఒకసారి మనస్సులో దేముణ్ణి తలుచుకొని టెలిగ్రాంకవరు చింపి లోపలి కాగితం లాగాడు...ఏదో టైపుచేసిన కాగితం టెలిగ్రాంకు అంటించింది వుంది...నెమ్మదిగా మనస్సు కుదుట బర్చుకొని టెలిగ్రాం చదివాడు...అంతే...అతని చేతిలోంచి టెలిగ్రాం జారి పడిపోయింది...'అమ్మా !' అని ఒక కేక పెట్టాడు...టెలిగ్రాం వచ్చిందంటేనే హడిలిపోయిన తల్లి, భార్యా యీ కేకవిని గొల్లుమంటూ ప్రవేశించారు...

'ఏమిరా నాయనా ! ఎవరికి జబ్బురా ! అక్కయ్య దగ్గర నుంచా ఏమిరా !' అంటూ రాగం తీస్తూ తల్లి అడిగింది.

'ఓరి మీయిల్లు బంగారంగానూ !!! ఏడుస్తా రేమ్రా ! నాకు ఫజిలులో మొదటి బహుమానం వచ్చిందట...కంపెనీ వాళ్ళు టెలిగ్రాం యిచ్చారు...' ఏమిటో అర్థంగాక అత్తా, కోడలూ ఒకళ్ళ మొహాలు ఒకళ్ళు చూచుకున్నారు...

'ఫజి లేమిట్రా ! మొదటి బహుమానం రావడం ఏమిటి?' అంది తల్లి.

ఆదినారాయణ మాట్లాడలేక పోయాడు. ఆనందంతో వుక్కిరి బిక్కిరి అయిపోయారు... తన కళ్ళముందు అయిదు వేల రూపాయల నోట్లు తాండవం ఆడుతున్నాయి. ఎంత అదృష్టం!! ఈ దెబ్బతో తన అప్పులన్నీ తీర్చేయవచ్చు !! హాయిగా సైకిలు కొనుక్కొని రోజూ ఆఫీస్కు వెళ్ళవచ్చు...ఇంట్లో అందరికీ బట్టలు కావలసినన్ని కొనుక్కోవచ్చు !! శహబాష్ ! ఆదినారాయణా ! ఏం లక్కీ ఫెలోవిరా నువ్వు !!! కళ్ళు మూసుకొని ఆనంద డోలికల్లో ఓలలాడుతున్న ఆదినారాయణకు తననుదురు మీద ఎవరిదో అరచెయ్యి పడేసర్కి కళ్ళు తెరిచాడు. ఎదురుగా తన భార్య !

'ఫజిలు ఏమిటండీ ! సంగతేమిటో చెప్పరూ ?' అంది. అప్పుడు ఆదినారాయణ తను ఫజిలు పూర్తిచేసి పంపడం వివరంగా చెప్పాడు.

* * * *

ఆదినారాయణకు ఫజిలులో మొదటి బహుమానం వచ్చిన సంగతి వూరల్లా ప్రాకిపోయింది...ఆఫీసులోని తోటి గుమస్తాలు యింటికివచ్చి అతనిని అభినందించి వెళ్ళారు. అన్నిసార్లు కబురు పంపిన డాక్టరుగారుకాని, అప్పులువాళ్ళుగాని ఆదినారాయణ బాకీ గురించి వత్తిడి చేయడం మానేసారు. ఆదినారాయణ టెలిగ్రాంను ఒక అట్టకు అంటించి అందరికీ చూపించి చర్వితచర్వణం చేయడం మొదలుపెట్టాడు.

* * * *

పదిరోజులు గడిచాయి! ఆదినారాయణకు స్వస్థతకల్గింది కనుక డ్యూటీలో జాయిన్ అయినాడు. అతనిమీద పూర్వం చూపే నిరాదరణ, అజమాయిషీలు కొంచెం తగ్గాయి!!! ముఖ్యంగా అతని తెలివితేటలనీ, అదృష్టాన్ని భట్రాజుల్లాపొగడడం మొదలుపెట్టారు. తాసీల్దారుగారు అతనిని తన గదిలోకి పిలిపించి అభినందించారు... ఆదినారాయణమనస్సు గాలిలో ఆనందంతో తేలిపోతోంది!! అతనికి ఏనుగంత బలం వచ్చినట్లయింది!!

దీపావళి అమావాస్యకని పిల్లలకు అయిదు రూపాయలు పెట్టి బాణాసంచా కొన్నాడు. బట్టల షాహుకారు కనపడి పాత బాకీగురించి బాధపడవద్దని, కావలిస్తే దీపావళికి బట్టలు చింపించుకోమని కోరాడు. కాదనడం ఎందుకని ఆదినారాయణ తలావక జతా బట్టలు కొన్నాడు.

* * * *

ఆనాడు నరక చతుర్దశి. అప్పుడే తలంటి పోసుకొని, వేడి వేడి ఫలహారం, కాఫీ సేవించి ఆదినారాయణ యీజీచైరులో కూర్చుని ఫైళ్లు చూసుకొంటున్నాడు. అసలు తను పని సరిగ్గా చేయకపోయినా ఎవరూ ఏమీ అనరు!!! కావలిస్తే తోటి గుమాస్తాలు సాయపడతానన్నారుకూడాను. అయినా తన విధ్యుక్త ధర్మం చేసికోవడంలో సోమరితనం కూడదని, తనకు యింతడబ్బు వస్తున్నా నిరాడంబరంగానే వుండాలని ఆదినారాయణ మనస్సులో ఒక నిశ్చయానికి వచ్చాడు. అందుకనే మామూలుగా ఫైళ్ళు యింటికి తెచ్చి శలవునాడు కూడా పని చూసుకొంటున్నాడు. అధికారులు కాస్త దయగా వున్నారుగదా అని మరీ

చనువు చూపించుకొని పని మొండికేస్తే వాళ్ళకు లోకువ అవు తామని ఆదినారాయణకు తెలుసు !!!

'సార్ ! పోస్టు' అన్న కేక వినపడి ఆదినారాయణ తల పైకెత్తి చూశాడు. ఎదురుగా పోస్టుమేన్ నిల్చున్నాడు.

'సార్ ! మీకు M. O. ను, బుక్ పోస్టు వచ్చాయి సార్!' అంటూ బుక్ పోస్టు అందించి పోస్టుసంచీ కిందపెట్టి M. O. ఫారంతీసి యివ్వడాన్కి కూర్చున్నాడు—M. O. అంటేనే ఆశతో వచ్చిన పోస్టుమేన్... ఈలోగా ఆదినాయణ బుక్ పోస్టు చించి లోపలి బులెటిన్ తీశాడు. అది ఫజీలు కంపెనీవాళ్ళు పంపినది. మొదటిపేజీలోవున్న వార్త చదివాడు.

"ఈక్రింది ఆల్ కరెక్టుగా పంపినవార్కి మొదటి బహుమతి అయిదువేల రూపాయలున్నూ తల వక ఇరవై అయిదు రూపా యల ఎనిమిది అణాలు చొప్పున పంచడమైనది..."

'సార్ ! ఇదిగో M. O. యిరవై అయిదురూపాయలు'

ఆదినారాయణ నెత్తిమీద పిడుగు పడ్డట్టయింది...

'ఆఁ' అంటూ అల్లాగే కూర్చుండి పోయాడు...



## అభిమన్యు

వీరి వయస్సు 21 సంవత్సరాలు. వీరి పూర్తి పేరు చింతలపల్లి లక్ష్మీనరసింహారావు. వీరి మిత్రుడు కథా రచయిత 'మాలి' ప్రోత్సాహంతో ఒక సంవత్సరంనుంచి కథా రచన చేస్తున్నారు. ప్రగతి నాట్యమండలిలో సభ్యుడుగా ఉండి, అనేక రంగస్థల నాటకాల్లో నటించారు. సంగీతమన్నా, నటనన్నా వీరికి ఎక్కువ అభిరుచి. ప్రస్తుతం హైద్రాబాదులో ఉంటున్నారు.

బహిర్గతం కాకపోయినా భావాలు మనస్సుల మీద పనిచేసి మనుష్యులను ఎలా క్రుంగతీస్తాంటాయో వీరి రచనల్లో కనిపిస్తూ ఉంటుంది.

★

# పరస్పరం



దీక్షితులు ఉద్యోగంలో చేరుతున్నాడంటే మిత్రులందరికీ రకరకాల అనుమానాలుపుట్టుకొచ్చాయి. దీక్షితుల్లో బాహ్యంగా అవుపించే లక్షణాలను బట్టి వారికా అభిప్రాయాలు కలగడం కూడ సహజవిరుద్ధం కాదు.

తల్లీ దండ్రీ అదుపాజ్ఞల్లో క్రమంగా పెరగలేదు దీక్షితులు. అనదలుచుకున్నదేమో మొహానే అనేసి ముందు ఎదటివాణ్ణి బాధపరుస్తాడు. పిదప తను ఖేదపడతాడు. ఆడవాళ్ళతో మసలు కోవడం మొదలుఎరుగడు. ఏ విషయంలోనైనా గోటితో గిల్లితే సమసిపోయేదానికి, గొడ్డలికి పని కల్పించగల దుడుకుతనం దీక్షితుల అభివృద్ధికి ఇంతకాలం ఆటంకంగానే నిలుస్తూవచ్చింది. అందుకే మిత్రుల్లో భయాందోళనలు బయల్దేరినయ్.

ఇంతా చేస్తే దీక్షితులు వెలగబెట్టబోయేది ప్లీడర్ గుమాస్తా. ఎల్లాంటి చిక్కుల్లోను ఇరుక్కుపోడని సమాధాన పర్చుకున్నారు. మరొక్క సంశయం వాళ్ళను పట్టి పీడిస్తుంది.

ఇంతవరకూ ఆడదాని చేతికూడు తిన్నపాపాన పోలేదు. దీక్షితులు వ్యక్తిత్వం వచ్చాక నలుగురి నడుమకు పోబోతు న్నాడు. కంది పచ్చడిలో కారం తక్కువయిందయినా అను మానం లేకుండా అనేస్తాడు. ఇల్లాలి గుండె కరక్కున కోత బడుతుంది.

ఇక పోతే, అందమైన అమ్మాయిని చూచి ఇకిలించే గుణం లేకపోయినా ఈసడించుకునే రోగముంది. ఎందుకో మరెవరికీ అర్థంకాదు.

కాని నిజమైన దీక్షితుల్ని వారు అవగాహనం చేసుకో లేదనే అనుకోవాలి.

* * * *

దీక్షితులు అదే నౌకరీ చేయదలిచాడు కాని కాలదన్న తలచుకోలేదు. చదువుకున్నది స్కూలుఫైనలే అయినా అటు ఆంగ్ల సాహిత్యంలోను, ఇటు మాతృభాషలోను విశేష జ్ఞానం కలవాడు. కేవలం అధిక పఠనం మూలానే అంత విజ్ఞానం అబ్బింది కాబట్టి, ప్లీడరుగుమస్తా ఉద్యోగం తన ఆశలకు, ఆశయాలకు దోహదం కాగలదని కూడ సంపూర్ణ విశ్వాసమున్నది. అందుకే చేరాడు. కొన్ని షరతులమీద ఒప్పుకున్నాడు. రోజుకు కనీసం మూడు గంటల కాలాన్ని తను స్వేచ్ఛగా వినియోగించుకోవాలి. ఎట్టి పరిస్థితుల్లోను తన అమూల్య వ్యవధిని అపహరించేఎత్తు వేయకూడదు ప్లీడరుగారు. నిక్కచ్చిగా మాట్లాడిన దీక్షితులు ప్లీడరుగారికి నచ్చాడనటంలో సందేహంలేదు. అల్లాంటివాడే తనకూ అతికి పోతాడని భావించాడు ప్లీడరుగారు.

"ప్లీడరుగారు అన్నంపెట్టి, గదిచ్చి, నెలకు యాభై రూపాయాలు రొఖ్ఖం ముట్టచెబుతారు వాడికి. లక్షణంగా వుంటుంది వాడి బ్రతుకు."

"వెనకటి జన్మల్లో ఏ సుకార్యం చేశాడోకాని, అందమైన అమ్మాయి తాకిడిలో పడిపోయాడు అదృష్ట జాతకుడు."

"ఎంతైనా వాడిది బానిస జీవితం. పెద్దల నీడన అణిగి మణిగి వుండాలి."

దీక్షితులు ఉద్యోగంలో చేరాక మిత్రుల్లో తలెత్తిన భావ పరంపరకూ ఒక తలా తోక అనేది శూన్యం!....

* * * *

దీక్షితుల డ్యూటీ పదకొండుగంటలకల్లా ముగిసిపోయింది. ఇంట్లోనే ఒక మూలనున్న తన గదికి వెళ్ళి తలుపులు మూసుకున్నాడు. ఘాటుగా సిగరెట్ పీలుస్తూ ఆలోచనల కుపక్ర మించిన దీక్షితులకు తలుపుతట్టిన శబ్దం కంగారు కలిగించింది. తలుపు తెరిచాడు. తల దించుకుని, గుండె చేత బట్టుకుని గుడ్లు తేలేశాడు అయోమయంగా. నిజానికంత గడబిడ ఏమీలేదు. ప్లీడరుగారి చెల్లెలు భోజనానికి పిలవాలని వచ్చింది.

"వదినగారు మీల్నికు రమ్మన్నారు" మృదువుగా అన్నది శారద కొద్దిగ చదువుకుంది గాన.

"సరే" అన్నాడు దీక్షితులు ముక్తసరిగా. ఇంకా ఏమో చెప్పాలనుకున్నాడు గాని ధైర్యం చాల్లేదు. శారద ఒయ్యారంగా నడుస్తూ వెళ్ళిపోయింది. దీక్షితులు చప్పున నాలుగు మెతుకులు కొరికి తిరిగి గదికొచ్చేశాడు. డ్రాయర్ తీసి, కలం కాగితాలు టేబిల్ మీద వుంచి ఆలోచించసాగాడు. అయిదు నిముషా లనంతరం కలం నడక సాగించింది. అలా రెండుగంట లకు పదిహేను నిమిషాలు తక్కువదాకా ఏదో వ్రాసి, ప్రక్క గది కుర్రాడిచేత టపాకూడ పంపించేశాడు. దీక్షితుల ముఖం

వింతగా విచ్చుకున్నది. సిగరెట్ పీల్చి, బట్టలేసుకుని ఆఫీస్‌రూమ్ కెళ్ళిపోయాడు.

* * * *

రోజులు ఇలాగే గడిచి పోతున్నాయి దీక్షితులకు. కాని ఒక్కటి బాధనిపించింది. ప్రతి దినం శారదే తన్ను పిలిచేందుకు ఎందుకు రావాలి? అలా రావడం తన జీవితానికి దెబ్బకాదా? అనుకుని మిక్కిలి మథన పడిపోయాడు. ఎలాగైనా శారద రాకను అరికట్ట నిశ్చయించుకుని మామూలుగా శారద పిలవ వచ్చిన సమయంలో-

"నన్ను పిలవడానికి మీరు రావడం కష్టమనిపిస్తున్న దండీ నాకు." అని ఎంతో బిగబట్టుకుని బయటపెట్టాడు. శారద చివుక్కు మన్నది. ఏవి టితని ధోరణి? అని. దీక్షితులు ఒక రకంగా మళ్ళీ చిన్నబోయాడు. సభ్యత తెలిసిన స్త్రీతో మాట్లా డాల్సిన లక్షణం కాదనిపించింది. ఒకవేళ తన్ను అనాగరికునిగా భావించు కుంటోందా?

కాని, తన్ను తాను అభినందించుకున్నాడు దీక్షితులు. ఏనాటికైనా ఆడవాళ్ళ చనువు ప్రమాదానికి దారి తీస్తుంది. ఏదో ఒక సందర్భాన తనూ శారద ఒంటరిగా వుండటం, నవ్వుతూ ఛలోక్తు లాడటం ప్లీడరుగారి కంటబడితే ఉద్యోగానికి నీళ్ళు వదులుకోవల్సిందే! ముందు పరిచయం వెనక ప్రణయంగా మారు తున్న సంఘటనలు గతించిన కాలంలోను, నడుస్తున్న చరిత్ర లోను అసంఖ్యాకం. అల్లాంటి ఆపదనుంచి విముక్తి పొందాడు తను. దీక్షితులు మురిసి పోతున్నాడు చేసిన సాహసానికి.

మాట ప్రకారం పిలవడం మానుకున్నది శారద. "ఎందుకు పిలవ్వు ?" అని వదినగా రడిగితే "పిలవంటే పిలవ" అన్నది పెంకెగా పసిపిల్లలా. అలా అనడంవల్ల కొంచెం మేలే జరిగింది. "పిల్లచేష్టలు" అనుకున్నదిగాని తరచితరచి అడగలేదు వదిన గారు. పిలవని కారణం శారదకు చెప్పే అవసరం తీరిపోయింది.

అయినా, శారద బాధపడుతూనేవున్నది. ఇంతదనుక శారద ప్రేమలో పడిందనటానికి ఆస్కారంలేదు. ముఖ్యంగా అంతస్థుల తారతమ్యం శారదకు తెలుసు. సహజంగా తొందర పడే స్వభావంకూడ కాదామెది. అయినా తీరనివ్యథపడుతూంది.

తను చూడలేనంత కురూపి కాదుకదా ! పైగా అంద మైనదే ! చదువు, సంస్కారంకలది. కులాసాగా కబుర్లుచెప్పినా అపార్థం చేసుకునే హీనమనస్తత్వమా తనది ? మిత్రత్వాన్ని స్వార్థాని కుపయోగించుకోవాలనే నీచురాలా ? అయినా అత డలాఊహించుకునేందుకు కారణాలేమున్నాయి ? అతనుమటుకు ఇంగితం లేనివాడా ? ఏమిటి తన వెర్రితనం ! ఎందుకీ బాధ ! పదిమంది చూస్తే కథలు కల్పిస్తారనే భయంతో అనివుండవచ్చు అతను. చివరికలాగ మనసును అసంతృప్తిగానే స్థిమితపర్చుకుంది శారద.

* * * *

ఒక నెలయాక దీక్షితులపేర వచ్చిన ఒక వారపత్రిక శారద కళ్ళ బడింది. అవ్యక్తమైన ఉత్కంఠతోనే పేజీలన్నీ తిర గేసి మళ్ళీ కవరులోపెట్టి దీక్షితుల గదికి పంపేసింది.

'పేపర్లుకూడ పఠిస్తాడుకాబోలు యువకుడు! అందుకేనా యీ కుసంస్కారం?' అని గొణుక్కుంది. దీక్షితుల గదికి వెళ్ళాలనే ఆరాటం వున్నది కాని అవకాశం కలగడంలేదు. కాదు...దీక్షితుల మాటతో ఆ అవకాశాన్ని శాశ్వతంగా కోల్పోయింది. అతనితో ఏదో సంభాషించి అర్థంకాని ఛెణుకులు విసరాలని, "పిచ్చి పుల్లాయిని" చేయాలని ఉత్సుకత శారదలో అవధుల్లేక పెరిగి పోతూంది. అప్పుడప్పుడూ తలపోస్తుంది! తిండి తిని వెళ్ళినవాడు రెండు గంటలదాక తలుపులు తెరవడు. ఎంత నిద్ర పెద్దమ్మో! అని..నవ్వు కుంటుంది.

దీక్షితుల పరిస్థితి పరిశీలిస్తే వంకరటింకరలు కనబడవు. కోరుకున్న మూడుగంటల కాలాన్ని సద్వినియోగ పరచుకోవడంకన్న శారదను తలచనైనా తలచడు. మూడుగంటల విరామంలో ఒక పది నిముషాలు భోజనానికి వృథా పరచుకున్నట్లు మాత్రం సూక్ష్మంగా బాధ పడుతుంటాడు. మిగతా సమయం ఉద్యోగ ధర్మం వుండనేవున్నది కదా! అందుకే ధార పోస్తాడు శక్తినంతా!

మరోనెల దొర్లింది. అదే వారపత్రిక మళ్ళీ శారద హస్తాల నలంకరించింది. వస్తే ప్రతివారం పత్రికరావాలి! కాని వెక్కిరించినట్లు నెలకో మారేమిటి? వారపత్రి కయికూడ! దీక్షితులు కథలు వ్యాసా లేమైనా వెలగ బెడతాడా?

అనుమానం తీరిపోయేందుకు ప్రతి పేజీ జాగ్రత్తతో చూచి నిరాశ పొందింది. దీక్షితుల పేరున ఒక కథ కాదుగదా.

కథల్లో దీక్షితుల పేరు తగిలినా పసికట్టి వుండేది శారద. కాని అలా జరగలేదు.

దీక్షితుల చర్యలన్నీ ఇంతగూఢంగా వుండటానికి హేతు వేమిటి? పిలవటానికి తన్ను వద్దని నివారించాడు నిష్కారణంగానే. తలుపులు బంధించి ఏంచేస్తుంటాడో అనూహ్యాం! ఆ తరువాయి వారపత్రిక నెలకోమారురావడం మరీ విచిత్రం! ఏ విషయమూ తనకు అంతు చిక్కడం లేదు. అసలు తనెందుకు అతని జీవితంపట్ల తాపత్రయం చూపడం? అతనికున్న ప్రత్యేకతేవిటి? ఆడవాళ్ళను ఉడికించగల తెలివితేట లున్నయనికూడ తోచదు. అతని ప్రవర్తనే తన్నిలా రెచ్చగొడుతోందా? ఛీ! అదేవిటి? తన కెలాంటి అభిప్రాయమూలేదు అతనంటే... ఒక ఇంట్లో తిరుగుతున్న వాళ్ళు కాబట్టి తెల్సుకోవాలనేకాంతు తప్పు! తనకు సంబంధం లేని వాడిపై ఎందుకీ శ్రద్ధ? అది మానవ నైజం! ఎదటివాడి తత్వం గ్రహించాలని ప్రతివాడికి కుతూహలం కలగటంలో తప్పేమున్నది? తనూ అలాగే! మగవాడయినంత మాత్రాన అతను మానవుడు కాకపోడుగా!

శారద దీక్షితులను ఎంతఅసహ్యించుకోవాలనకుంటుందో అంత చేరువవుతున్నాడు. ఆలోచనలను పురిగొల్పుతున్నాడు. అన్నివిధాల మథనపరుస్తున్నాడంటానికి ఆమె వర్తనే తార్కాణం. కాని దీక్షితులకు శారద అవస్థ తెలియదు. తెలిస్తే కనీసం సానుభూతి సూచకంగా అనుమానాలు తొలిగించేవాడు. ఆ మాత్రం కనికరం లేకపోలేదు అతనికి.

* * * *

ఒకనాడు దీక్షితుల పేర ఇరవై రూపాయలు మనియార్డ రొచ్చింది. ఆదుర్దాగా తీసుకుని కూపన్ చదివింది శారద.

"ఆర్యా, మీరు పంపిన రెండు కథలు- "గుండెబరువు" "ఎండ-వానలు" ను ప్రచురించినందుకు ప్రతిఫలం స్వీకరిస్తారని ఆశిస్తున్నాను...సంపాదకుడు..."

ఒక్కమారు కాలం వెనక్కు తిరిగింది శారద ఊహాపథంలో. "గుండెబరువు" చూచిన కథే! "ఎండ-వానలు" చదివిందికూడ. కాని అవి దీక్షితులు వ్రాశాడా? వ్రాయగలడా? అటువంటివాడికి తనతో మాట్లాడగలిగిన సంస్కారం లేదా? సాహసం వుండదా? దీక్షితులు ఒక రచయిత! తన అన్నదగ్గర గుమాస్తా దీక్షితులు కథా రచయిత! నమ్మడం ఎలా? "ఎందుకు నమ్మవ్?" ఆత్మ అదరగొట్టింది.

శారదకు కళ్ళు చెమ్మగిల్లాయి మరుక్షణంలో. దీక్షితుల్ని గురించేనా తను అపోహాలు పడ్డది! వికృత రూపాల్ని చిత్రించుకున్నది హృదయంలో...!

అయితే, సకారణంగానే తన్ను పిలవటానికి రావద్దని వుంటాడు. నిష్కారణంగా తలుపులు మూసుకోడు. తన దురభిప్రాయాలకు ప్రాయశ్చిత్తమేమిటి? ఎంతో విశాలతలేనివాడు. త్రికాలాలను వాస్తవంగా కనీసం ప్రతిబింబాలగానైనా ఊహించచేతకానివాడు కలం పట్టజాలడు. ఇంతలో ఇంతై చివరకు తన దృక్పథమే నీచమా? తనెంత? తన భావనాజగత్తు విస్తారమెంత?

ఇలా తక్కువదనం అనుభవిస్తూ, దీక్షితులకు క్షమాపణ చెప్పుకోవాలనే తరుణంకై ఎదురుచూస్తూ...మనోవ్యథతో జ్వరాన పడింది. యథావిధిగా డాక్టర్ మందివ్వడం. ఇక రేపో మాపో తగ్గుముఖం పడుతుందని ప్లీడరుగార్ని ఓదార్చడం జరుగుతూంది. ఈ సందర్భంగా దీక్షితులకు కొంచం భౌతిక కష్టమే కాక, మానసిక శ్రమకూడ ప్రాప్తించింది. సామాన్యజ్వరం అధమపక్షం నాలుగైదురోజులకన్నా బాధించదు. వారం దాటిపోయినా శారద మంచం దిగలేదు.

తను రావద్దన్నందుకు మనసుకు కష్టం కలిగిందేమో! అంతర్గతంగా తన్ను ప్రేమించడం లేదుకదా! లేక ఇతరత్రా భగ్నప్రేమతో కుములుతున్నదా? తనకు తెలిసినంతవరకు శారద అల్పురాలుకాదు. సూత్రప్రాయంగా తెగిపోతున్న నేటి ప్రేమ బంధనాలకు అర్రులుచాచే తత్వం కాదని మొదటి చూపుల్లోనే గ్రహించుకున్నాడు. అల్లాంటి మనస్తత్వాన్ని చెదరగొట్టే అవకాశం కలగకుండా, దూరంగా వుంచేశాడు. బహుశః శారద రోగానికి తను కారణం కాకపోవచ్చు. అనుకుని తాత్కాలికంగా మనసును సరిపెట్టుకున్నాడేకాని నిశ్చింతగా వుండలేక పోతున్నాడు తెలియని భయంతో దీక్షితులు.

శారదను పలకరించి కదిలించాలని ఉద్దేశమూ జనించింది. ఏమాత్రం తనవల్ల బాధపడుతున్నదని సూచనలు కనబడినా క్షమాపణ చెప్పుకుంటాడు. అది తన విధ్యుక్త ధర్మం! ఎందుకంటే తన రాకతర్వాతనే శారదలో యీ మార్పు కలిగింది.

మనిషొచ్చిన వేళ, గొడ్డొచ్చిన వేళ, కుటుంబాన్ని తారుమారు చేస్తుందంటారు పెద్దలు!

రోజులు మారి నెలల్లో పడ్డది రోగం! ఇంకా కృంగి పోతూనే వున్నది శారద. ఎప్పుడూ తలనొప్పి ఎరగంది యీ మంచం బట్టడ మేవిఁటా అని ప్లీడరుగారు లోతుగా యోచించారు. వదినగారు దిగాలుపడిపోయింది. శారద పరిస్థితి దాదాపు విషమించ తయారైంది. డాక్టర్ మెంటల్ ట్రీట్ మెంటు ఆరంభించి తికమకతిన్నాడే కాని రోగనిర్ణయం చేయలేకపోయాడు.

నీరసంగా అనుకుంది శారద— "డాక్టర్ను పుట్టించిన వాడికైనా తన రోగం తెలీదు" అని.

దీక్షితులు పదిరోజులనుంచీ శారదను చూడటం మానుకున్నాడు. దినాలు గడుస్తున్నకొద్దీ తన్ను తానే నమ్మలేక పోతున్నాడు. ఒకవేళ తనే కారకుడా శారద హీనస్థితికి ? క్షణ క్షణం ఈ ప్రశ్న వేధిస్తోంది అతణ్ణి.

* * * *

అత్యావసరమైన పనిమీద శ్రీమతితో సహా వెళ్తూ ప్లీడరుగారు శారదను చూస్తుండమని దీక్షితులకు చెప్పారు. సరే నన్నాడు. దీక్షితులు 'సరే' నంటే ప్లీడరుగారికి చచ్చే నమ్మకం! నిర్భయంగా వెళ్ళేడు.

దీక్షితులు శారద గది ప్రవేశించాడు. అవ్యక్తంగానే అతని కళ్ళంట బాష్పాలు బొటబొట రాలినయ్. బుచ్చిబాబుగారి "మిగిలిపోయిన" శారద ప్రక్కమీద పడివుంది. దీక్షితుల హృదయం తరుక్కుపోయింది. పదిరోజుల్లో పెద్దమార్పు!

శారద నిస్పృహాలో వున్నట్లు గమనించి దూరంగా కుర్చీలోకి ఒరిగిపోయాడు.

శారద ! ఎటువంటి శారద ! చిక్కి, శల్యామై తుదిక్షణాలు సమీపిస్తున్న శారద ! ఆమె గుండె తీవ్రంగా గాయపడటానికి బలీయమైన కారణాలేవిటి ? తన ప్రవర్తన ప్రభావం కాదుగద భగవాన్ !

హృదయంలో సుడిగాలులు వీచసాగాయి. తన రాక తోనే సుకుమారి కోమలశరీరం కుమిలిపోయిందా ? మృత్యువు... భగవాన్...!

దీక్షితులు మానవలోకాన్ని మరచి వెర్రిగా కేకబెట్టాడు. మానవహృదయం అంతత్వరితగతిని ద్రవిస్తుంది. ఊహామాత్రంగానైనా పరిస్థితుల బోధపరుచుకోగల సమర్థత కూడ దీక్షితుల్లో వుండటాన, తనవల్లనే ఒకవేళ మరొకఅబల అన్యాయమైపోతుందేమోనని సహించలేకపోయాడు. క్షమాపణ వేడుకుందామని ఆవేశం శరవేగాన వచ్చిపడింది. పరస్త్రీ... పెళ్ళికాని కన్య అన్న విచక్షణ కూడ లేకపోయింది. మనిషికీమనిషికీ మధ్య సహజంగా వుండాల్సిన ప్రేమ...పొంగులుబారి...కరుణరసంతో మిళితమై వెల్లువలైంది దీక్షితుల్లో.

"శారదా" అంటూ పరుగెత్తి చెంపలునిమిరాడు నిష్కల్మష నిస్స్వార్థ ప్రేమతో. శారద కళ్ళు తెరిచింది.

"శారదా ! నీ యీ విషమస్థితికి నేనే కారణమైతే క్షమించు... క్షమిస్తావా శారదా ?" బావురుమన్నాడు.

ఎంతో దుఃఖం ముంచుకొస్తే ఒక్కబొట్టు పైకుబికింది జీవంలేని శారద నేత్రద్వయంనుంచి.

"దీక్షిత్... ముందుగా... నన్ను... క్షమించానను" అని అతని చేయి నిమిరింది పవిత్ర హృదయంతో.

"క్షమించాను...."

"నేనూ....ను...." వాడిపోయిన మొగ్గ తిరిగి చిగిర్చింది. దీక్షితులకు అంతా అర్థమైంది.



## ఐసోలా

వీరి వయస్సు 32 సంవత్సరాలు. వీరి పూర్తిపేరు అయ్యల సోమయాజుల సత్యనారాయణమూర్తి. పాట్నా విశ్వవిద్యాలయం నుంచి సైకాలజీలో ఎం. ఏ. పట్టభద్రులు. కొంతకాలం జర్నలిజంలో కృషిచేశారు. ప్రస్తుతం హైదరాబాదులోని ఇండియన్ కేబుల్ కంపెనీలో అసిస్టెంటు మేనేజరుగా పనిచేస్తున్నారు.

వీరు వ్రాసిన "బట్టతలలు" "బేస్తుగాడు" అనే రచనలు అనేక పాఠకులలో సంచలనం కలిగించాయి. వీరి రచనలు తరుచు వివిధ పత్రికల్లో కనిపిస్తూంటాయి. వీరి అభిరుచి నాటకాలలో పాల్గొనడం.

పాత్రల మానసిక తత్వాలను ప్రతిబింబింపచేస్తూ, వ్యంగ్యధోరణిలో, సూటిగా, పటుత్వంగా కథలను చిత్రించడంలో వీరు అందెవేసిన చెయ్యి.

★

# కలయో! వైష్ణవ మాయయో....!

వెంకయ్య వుసూరుమంటూ వేస్తూన్నాడడుగులు. టాంకుబండ్ అంతా కొలిచి అవతల పడితేనే గాని గది రాదు. అప్పుడే బాగా చీకటి పడింది. చెరువుకట్ట వైపు కొండలనిండా వెలిసిన నవాబుల భవనాలలో దీపాలు నక్షత్రాలలాగ మెరుస్తున్నాయి. అక్కడ వా రెప్పుడూ దీపావళి జరుపుకుంటారు కాబోలు. ఆ దీపాలు చూస్తూంటే నక్షత్రాలు సమావేశమయాయా అనిపించింది వెంకయ్యకి. తన భావి నిర్ణయించుతూన్నారేమో ఆ ఆకాశపు అధినేతలు. తనకు భావి అన్నది అసలు వుందా? ప్రస్తుతం మాత్రం తన జేబులో కానీ లేదు. ప్రస్తుత మేమిటి ఇంచుమించుగా తను పట్టభద్రుడయిననాటినుండీ పరిస్థితి ఇదే విధంగా వుంది. బి.ఏ. యెలా ప్యాసయాడో తను. చదువుకునే రోజుల్లో వారాలు చేసుకుంటూ మాసిన చిరిగిన బట్టలతోనే బ్రతుకుతూన్నా వుత్సాహంగా వుండేవాడు. ఆ నవాబుల భవనాలలోని ధనం తన జేబులో లేకపోయినా వాటిలో వెలిగే దీపాలలాగ తన శరీరంలో హృదయం ఆశతో వెలుగుతూండేది. ఒక్క ఏడాదిలో ఎంత మార్పు! ఏం మార్పు? తన దుస్తులకేసి చూసుకున్నాడు వెంకయ్య. వెనకటిలాగే చిరిగిన చొక్కా అతుకుల తెరచాపలాగ రెపరెపలాడుతూంది. ఇంకేమిటి మార్పు? అప్పుడు ఏడుగురు తల్లులు ఏడువారాలు చల్లగా చల్లపోసి తన

కడుపు నింపేవారు. నిన్న హోటలువాడు ఇంతవరకూ ఇవ్వ వలసిన డబ్బు ఇస్తేనేకాని తన ముఖం చూడడం ఆనందంగా వుండదన్నాడు. చివరిపైసవరకూ కక్కితేనేకాని అన్నం తిన వద్దని ఖచ్చితంగా చెప్పాడు. వాడికిస్తేనేగాని తను అన్నమే తినకూడదుట! బహుశా తను పారిపోతానేమోనని గదిదగ్గర ఒక మనిషిని కాపలా వేయగలడు కూడాను. వాడే తను ఏ తప్పుదారినీ పోకుండా కాపాడుతాడేమో. ఈ బ్రతుకుబరువు మోయలేక.... అన్న బసవరాజు మాటలు జ్ఞప్తికి వచ్చాయి. అడుగులుతేలిపోతున్నాయి. అక్కడున్న బల్లమీద కూర్చున్నాడు. ప్రొద్దున్నించీ ఏం చేశాడు? చివరికి భోజనమైనా చేయలేదు. తిరుగుతూన్నాడు వుద్యోగంకోసం. తిరుగుతే వుద్యోగాలు వస్తు న్నాయా ఈ జమానాలో! తిరగకుండా మాత్రం దొరుకు తాయా? పోయిన నల్లపూసైనా కొంతసేపు వెతుకుతే దొరుకు తుందికాని ఉద్యోగంమాత్రం ఎంతవెతికినా దొరకదు. అందులో తనున్న అవస్థలో! తన పరిస్థితి చూసి జాలైనా కలగటంలేదే! మనిషంత చవకైన చులకనైన వస్తు విప్పుడు మరొకటి వుండే వుంటుందా? తనని చూస్తే అసహ్యమా? ఈసడించుకుంటాడు ఆ ఆఫీసరు. ఒక్కసారి పళ్లు కొరికాడు. పిడికిలి పిండుకున్నాడు వెంకయ్య. అలాగే ఎదురుగాకనబడే దీపాలవరుసలోకి చూశాడు. రెండు వేడి కన్నీటి చుక్కలు కారాయి. వెనుకనున్న బల్లకి తల వ్రాలింది.

మెల్లిగా లేచాడు. నడిచాడు వెంకయ్య. క్లబ్బులనుంచి కార్లలో హారన్లు కొట్టుకుంటూ ఇండ్లకి పోతూన్నారు ఘన

కార్యాలు చేసి అలసిపోయిన పెద్ద వుద్యోగులు. సాయంత్రం తనని పొమ్మన్న వుద్యోగి అందులో ఒకడేమో? తను ఇప్పుడు కారుకి అడ్డంగా నుంచుని ఆపి ఆతని ముఖాన్ని అసహ్యించు కునేటట్లుచేయలేడా? చేయగలనా అనిపించింది. కాళ్ళు లాగు తున్నాయి. అడుగులు మందంగా పడుతున్నాయి.

మొత్తంమీద గదివచ్చింది. ఇది ఎంతకాలం తనగది అని చెప్పుకోగలడో. హోటలువాడి కంటె ఇంటివాడే మంచి మనిషిలా వున్నాడు. వాడు వ్యాపారి. ఇతనుసంసారి. తనూ సంసారే. బి.ఏ. చదువుతున్నందుకు ఇంకేమీ ఆలోచించకుండా పిల్ల నిచ్చాడు మామ. ఏమని ఇచ్చాడో. తను తండ్రికూడా కాబో తూన్నాడు ఖర్మ. పుట్టబోయేవాడు అదృష్టం తెస్తాడుట. ఇంత మంది పుట్టారు. అదృష్టాలు మారుతున్నాయా. తను పుట్టి నప్పుడు నాన్నకూడా అలాగే అనుకున్నాడేమో. ఇప్పుడు వుండివుంటే ఏమనుకునేవాడో. తనకు కలిగేవాడు దరిద్రం మాత్రం తీసుకరాలేడు. తీసుకవస్తే ఇంకెవరికేనా తీసుకురావాలి. గదిలో దీపం వెలిగించగానే వుత్తరం కనపడింది వెంకయ్యకి మామదస్తూరీ. పురుడు వచ్చిందేమో. డబ్బు ఏమైనా పంపు తున్నానని వ్రాసివుండచ్చు. పురిటిరోజులు ముందుండగా డబ్బు సర్దుపాటు చేస్తాడా.

ఉత్తరం చింపాడు. "చిరంజీవులైన ... పుత్రపౌత్రాభి వృద్ధిగాను ఆయురారోగ్యైశ్వర్యాభి వృద్ధిగాను దీవించి వ్రాయు నది. ఉభయకుశలోపరి...సాయంత్రం 7-35 గంటలకు పున ర్వసు నక్షత శుభసమయమున పుత్రరత్నమును కనినది. తల్లి

పిల్లవాడు ఆరోగ్యముగా వున్నారు. నీ వుద్యోగప్రయత్నములు సవ్యముగా కొనసాగుచున్నవని తలచెదను. నీ క్షేమసమాచారములు తెలియజేయ వలసినది. వీలుచూసుకుని పుణ్యావాజనమునకు ఇచ్చుటకు రావలసినది." పిల్లవాడు ఎలా వుంటాడో అనుకున్నాడు. పుణ్యావాజనానికి ఆహ్వానం ఇంకా ఎనిమిదిరోజులుంది. తనో వాజమ్మ. కడుపులో ఎలకలు పరుగెత్తుతూంటే ప్రయాణాలు గురించి ఆలోచనలా? సరిగా మూడుపూటలైంది అన్నంతిని. అన్నం రుచికూడా మరిచి పోతూన్నాడు. డబ్బు గురించి ఏదో వ్రాయకపోతాడా అని ఆశపడ్డాడు. ఖర్చుగురించి వ్రాశాడు. ఎలా వస్తాననుకున్నాడో. తన పరిస్థితి ఇంక ఎలా వ్రాసివుంటే అతనికి అర్థమవునో. పకోడీలు కొనుకుందామని పరిగెత్తేకూడా అది చదువుతే ఆ అణా తన చేతుల్లో పెట్టే విధంగా వ్రాశాడే వుత్తరం. ఏదో పిల్లని వదుల్చుకుందామని తన మెడకి చుట్టాడుకాని తనమీద అభిమానంతోనా. పిల్లమీద మాత్రం ఏం ప్రేమ చూపించాడు. తనవంటి నిర్భాగ్యుడికిచ్చి పెళ్ళి చేస్తాడా? వాడి కెప్పుడో బుద్ధి చెప్పాలి. ఎదురుగా కూజా వుంది. కాలు విసరబోయాడు. కూజాని చూడగానే దాహం వేసింది. అలాగే త్రాగాడు. ఇంక కొద్దిగా నీళ్ళు మిగిలాయి. నిన్న ప్రొద్దున పట్టిన నీరు. దానిమీదే జీవిస్తూంటే ఎంత కాలం వస్తుంది. పెద్దలు చెప్పారు...పెద్దలు...కూర్చుని తింటే రాళ్ళూ గుళ్ళూ ఆటి రావని. రాళ్ళే తినేవారేమో ఆ పెద్దలు. నిన్నటినుంచి ఏమీ చేయనట్లే వుంది. కాలం స్తంభించిపోయి నట్లుంది.

మామవుత్తరం వ్రాశాడు. వుత్తరం...! పక్కపరిచాడు, వెంకయ్య. వాలాడు. ఉత్తరంలో ఏమీ లేదుగదా. రేపు M.O వస్తుందని అసలేలేదు. ఇలాటి వుత్తరం ఎవరు వ్రాయమన్నారు? చేయి ఎలా వచ్చింది వ్రాయడానికి. పుత్రపౌత్రాభివృద్ధిగా దీవించి వ్రాస్తున్నాడుట. తన కడుపు నీళ్ళతోనేకాని నింపలేక పోతుంటే పుత్రులు పౌత్రులు సంఖ్యలో వృద్ధి చెంచాలట. తను వుత్తరంనిండా డబ్బుగురించి వ్రాస్తే జవాబులో కానీ పంపు తున్నట్లులేదు. కాని ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిగా దీవనలు. మూడు పూటలనుంచి అన్నం చూడనివానికి ఆయురారోగ్యాభి వృద్ధిట. బ్రతుకిలా వున్నప్పుడు దానినింకా సాగతీయడానికి, బలవంతంగా పొడుగించడానికి ప్రయత్నాలెందుకో. హృదయం లోనుంచి వచ్చిన దీవనలేనా అవి. అంతా దగా! హృదయంలో నుంచి అలాటి మాటలు వస్తాయా. కొంపలంటుకుంటే సంగీతం లాగ ఇప్పుడు దీవన లేమిటి. పుత్రరత్నం పుట్టాడుట. రత్నం! రత్నమైతే తను అమ్మడానికి సిద్ధంగా వున్నాడు. ఎవడు కొంటాడు? అందరూ రత్నాలు. పుత్రరత్నాలు! నవ్వుకున్నాడు వెంకయ్య. రేపటినుంచి వస్తాయి వుత్తరాలు ఇల్లాలి దగ్గరనుంచి పాలడబ్బాలు, ఆముదం సీసాలు. అన్నీ ఖరీదులు పెరిగి పోవడాలు. జేబులో కానీ లేనంతకాలం ధరలతో తనకేమిటి సంబంధం. పిల్లవానికి జలుబుచేసింది. జ్వరం వచ్చింది. నాన్న ఎక్కడినుంచి ఎంతకాలం ఎంతని తెస్తాడు అంటుంది కట్టు కున్నది. తను ఏంచేయగలడు. కోపంగా వుత్తరం వస్తుంది. ఇలాటి వానిని కట్టుకోవడం కంటె ఏ నుయ్యో గొయ్యో...

చిరాకుపడ్డాడు వెంకయ్య. ఇటు తిరిగాడు. పిల్లవాడు పాల కోసం ఏడుస్తున్నాడు. కడుపునొప్పి. ఆముదం పెట్టి మూడు రోజులయింది. కొద్దిగా జ్వరం తగిలింది. జ్వరం ఎక్కువవుతోంది. చిరాకు ఎక్కువైంది వెంకయ్యకి. ఈ సమయంలో ఎవడు పడమన్నాడు ప్రపంచంలో వాడిని. తనకున్న కష్టాలు చాల వని పుట్టాడా. తన కసలు పిల్లలంటేనే చిరాకు. పిల్లలకోసమని పెళ్ళి చేసుకున్నాడా తను ? కడుపులో ఆకలిమంటలు ఎక్కు వయాయి వెంకయ్యకి. కళ్ళలో పిల్లవాని ఖాళీ పాలడబ్బా కనబడుతోంది. క్రిందకి చూశాడు. మామ వ్రాసిన డబ్బుకి సంబంధంలేని వుత్తరం కనపడింది. చటుక్కున లేచాడు. దానిని ముక్కముక్కలుగా చేశాడు. చాణక్యుడు జ్ఞప్తికి వచ్చాడు. తను చాణక్యునికి తీసిపోయాడా చాకచక్యంలో ! వాడి అదృష్టం బాగుండి ఆకాలంలో పుట్టాడు. చాణక్యుడు నందుల్ని నాశనం చేస్తానన్నాడు. చేశాడు. తనూ తన కుర్రవాని మెడ మెలిపెట్టి వేయగలడు. తనాపరా ఏమిటి బ్రతుకుకి అడ్డంగా నిలబడితే ? రెండు చేతులు వ్రేళ్ళలో వ్రేళ్ళు పోనిచ్చి గట్టిగా పిండాడు. పిల్లవాడు కెవ్వుమన్నట్లు అనిపించింది. కళ్ళు మస కలు కమ్మాయి. అలాగేకన్నుమూసి వాలిపోయాడు వెంకయ్య.

వెంకయ్య వులిక్కిపడి లేచాడు. తను స్వహస్తాలతో పిల్ల వానిని పసికందుని ప్రపంచకమంటే తెలియనివాడిని బలవంతంగా బైటకి, ముందువచ్చిన చోటకి, మరెక్కడికో పంపించాడా ! కళ్లు తెరవని గ్రుడ్డు, చెంపగిల్లితే పాలుగారే పాప ప్రాణాలు పుచ్చుకున్నాడా ! తన ఆకలి అంతటితో తీరిందా ? ప్రపంచకం

పైన తనకు తెలిసిన, తెలియని జీవకోటిపైన ఆ పైన వుండే అనూహ్యశక్తులపైన తన కసి కసుగాయప్రాణాలు తీయడంతో పోయిందా ? కూచున్నాడు వెంకయ్య. శరీరమంతా ముచ్చెమటలుపోసాయి. కొద్దిగా కంపిస్తున్నాడు. ఇటూఅటూచూశాడు. దీపం వెలుగుతూనేవుందే ! ప్రక్కనే వున్నాయి మామ వ్రాసిన నిరర్థక లేఖయొక్క మృత అవశిష్ట విభాగాలు. అయితే ఇది కలా ! తను ఎంత హీనస్థితిలో వున్నా అటువంటి దారుణ కృత్యం తలపోయగలడా ! తన గ్రుడ్డు ప్రాణాలు తనచేతితో తీయడమే ! ఎటువంటి పీడకల ! లేచి మంచినీరు త్రాగడానికి కూజా తీయబోయాడు. కుడిచేయి కదలలేదు. ఆశ్చర్యపడ్డాడు. చేతికేసి చూసాడు. అయినా చేయికదలలేదు. విదపబోయాడు. అందులో జీవం నుందే పోయిందిగా. నాలిక ఎండుతూంది. పేగులు అరుస్తున్నాయి. కళ్ళు శూన్యంలోకి ఏదో పోయినదానిని వెతుకుతున్నాయి. అటువైపే పడుకునివుంటే తిమ్మిరెక్కిందేమోననిపించింది. ఎడమచేతితో కుడిని తడిమాడు. జలజలమనటం లేదు. జీవమే లేదు.

కల జ్ఞప్తికి వచ్చింది. కుడిచేతితో పిల్లవాని మెడ పిసికాడు. వాడు కెవ్వుమనైనా అనలేక పోయాడు. అదే ఈ చేయి. చచ్చినది వాడుకాదు తన చేయి. కుర్రవాడు పోలేదు. తన కుడిచేయి పోయింది. పిల్లవాడు కుడిచేయికాదూ ! ఇంక రేపటి నుంచి వుద్యోగప్రయత్న మెలా చేయడం ? ఈ చేయి తిరిగివచ్చే మార్గమేమిటి ? పక్కమీద కూలాడు వెంకయ్య. రెక్కాడితేనే గాని డొక్కాడదే. ఇంకేమిటి బ్రతుకు తెరువు ? చిన్ననాటి

మిత్రుడు సుబ్బారాయుడు జ్ఞప్తికి వచ్చాడు. జామిచెట్టుమీద కూర్చుని పిచ్చాపాటీ చెప్పుకుంటున్నారు. పట్టుజారి క్రిందపడ్డాడు సిమెంటుసంచీలాగ. చేయి వంగింది. సాగలేదు. తల్లీ దండ్రీ తోమించారు. కదలలేదు. వాచింది. ఇంకా వాచింది. తోమి తోమి పట్నం పట్టుకుపోయారు వాడినీ చేతినీ. పెద్ద డాక్టరు మూడు నిముషాల్లో ముక్కలుచేసాడు. మటుమాయంచేశాడు వాడి చేతిని. అయితేనేం వాడికి వుద్యోగంఅవసరంలేదు. సుబ్బారాయుడు పదిచేతులున్నవాడిలాగే బ్రతుకుతున్నాడు. తన గతేమిటి? తన చేతికేసి చూశాడు. నొప్పిలేదు. వాపులేదు. రబ్బరుపాములాగ పడివుంది. కళ్ళు కాలువలు కట్టుతున్నాయి. కరిగిపోతున్నాయి. నిస్త్రాణ వచ్చింది వెంకయ్యకి. భగవంతుని భుజాలమీద బ్రతుకుబరువు మోపడంకంటె మరోమార్గం కనబడ లేదు. తిరుపతి వెంకన్న ప్రత్యక్షదైవమట. తనకి చేయివస్తే కొడుకుకి వెంకన్నబాబు పేరు. తరువాత ఉద్యోగం కూడా దొరుకుతే పిల్లతో సంకలో పిల్లాడితో తిరుపతి యాత్ర. ఏడు కొండలవాడు ఎవ్వరినీ దగా చేయలేదు. గోవింద గోవిందా! ఏడుకొండలవాసా! వెంకటరమణా గోవిందా! చెవులలో గుడి గంటలు మ్రోగాయి. కన్నులలో హారతి జ్యోతులు వెలిగాయి.

సూర్యుడు సహస్రకరాలతో కండ్లని పొడుస్తున్నాడు. అబ్బ! ఇంత సేపు ఎప్పుడూ నిద్రపోలేదు. చాలా ప్రొద్దయి వుంటుంది. లేవబోయాడు. శరీరం స్వాధీనంలో లేదు. మూడు రోజులనాటి ముద్ద. నీరసంకాక స్వారస్యమేముంది. మెల్లిగా లేచాడు. ఒళ్ళు విరిచాడు. రాత్రి విషయం జ్ఞాపకం వచ్చింది.

కుడిచేయి చూసుకున్నాడు. సరిగానే వుంది. కలనుకున్నాడు. కాని తనులేచాడు; మంచినీరు త్రాగబోయాడు. నాలిక ఇంకా ఎండి బండబారేవుందే! కలమాత్రం కాదు. ఏమో! కలయో! వైష్ణవ మాయయో! మరి ఏ యితర సంకల్పార్థమో! పోతన అన్నదా? తనే అంటున్నాడా? ఏదైతేనేం తన కుడిచేయి రెక్క గూటిలో ఆడుతూంది. ఇంకా వెలుగుతూన్న దీపం కనపడింది. ఒక్క నమస్కారం చేశాడు వెంకయ్య.



## టి. వి. రత్నావళి

జననం 1925. వీరు గత కొన్ని సంవత్స రాలుగా కథారచన కొనసాగిస్తున్నారు. స్త్రీల దృక్పథంనుండి మానవ మనస్తత్వాలను చిత్రిస్తూన్న వీరి కథలతో "మధురక్షణాలు" అనే ఒక సంపుటి, యశోధర ప్రచురణగా వెలువడింది.

వీరి అభిరుచులు నాటకాలు వ్రాయడం, నాటకాలలో పాల్గొనడం, సంగీతము, అల్లికలు, తోటపని మొదలయినవి. ప్రస్తుతం హైద్రాబాదు నగరమందలి బాలికోన్నతాపాఠశాలలో సహాయోపాధ్యాయినిగా పనిచేస్తున్నారు.

పాత్రల ఆంతరంగిక స్వభావాలకు ప్రాధాన్యత యిచ్చే సాంసారికకథలు వ్రాయడంలో వీరికి మంచి నేర్పు ఉంది.

★

# కట్నం కోసం....

"శకుంతల ఎంత అదృష్టవంతురాలు ? ఎంతఅదృష్టవంతు రాలూ కాకపోతే అలాంటి భర్త దొరుకుతాడు ? 'పుణ్యాం కొద్దీ పురుషుడు...' అని ఏదో పూర్వజన్మ సుకృతం ఉండ బట్టే...మల్లెపువ్వులాంటి భర్తదొరికాడు. బంగారు మల్లెపూలు పూజచేసింది. తలలుకొల్చి త్రాసులో తూచినట్లుగా కుదిరాయి! చిలుకా .. గోరువంకల్లా ... రూపూ, రేఖలు!... ఈడూ జోడూ!... అందం...చందం...అన్నీ అచ్చుపోసినట్లు అమ రాయి!...ఏనోము నోచిందో...కాని బంగారు కొమ్మపట్టింది." అని పెళ్ళి కొచ్చిన పేరంటాళ్ళంతా మురిసిపోయి !... పీటల మీద కూర్చున్న వధూవరుల నాశీర్వదించి అక్షింతలు జల్లి శకుం తల అదృష్టాన్ని వెయ్యినోళ్లతో పొగుడుకుంటూ వెళ్ళి పోయారు !

ఏ తలిదండ్రులు మాత్రం తమ ఆడపిల్లల అదృష్టాన్ని కోరరూ ? అందులోనూ ఆడదిక్కులేని ఉమామహేశ్వరరావు గారుకూడా అందరిలాగే తగిన సంబంధం తెచ్చాడు.

ఆవేళకూడా ఉదయమే అలవాటు ప్రకారం ఉమామహే శ్వరరావుగారు కటకటాల వరండాలో వాలుకుర్చీలో కూర్చుని "హిందూ" విప్పారు. అది ఆయన నిత్యకృత్యాల్లో ఒకటై నప్పటికి ఆవేళమాత్రం ప్రత్యేకంగా పలకరించింది. ఎందుకో

ప్రకటన రూపంలో "మేట్రిమోనియల్స్!" సంబంధాలకోసరం సతమతమవుతూన్న అతన్ని అనుకోకుండానే అతనికళ్లు మేట్రిమోనియల్స్‌ని ఆక్రమించాయి. "సర్వాంగసుందరి...కట్నం కానుకలతో కావలెను. అకణ్వ గోత్రికులు కావలెను. ఎలక్ట్రికల్ ఇంజనీయర్. పాతికేండ్ల ప్రాయము గలవాడు. ఉమామహేశ్వరరావుగారు కోరినవన్నీ కుదిరాయి! వెంటనే ఆవేళే తిధి, వార నక్షత్రాలుకూడా కుదరడంవల్ల అప్లై చేసేశాడాయన.

అతని ఏకైక పుత్రిక శకుంతలతల్లి తొలికాన్పుకే స్వర్గం అలంకరించింది. పురిటి పిందెను పెంచి పెద్దదాన్ని చేశాడు తాత ఉమామహేశ్వరరావు. శకుంతలతల్లి ఉమామహేశ్వరరావుగారికి చివరిరోజుల్లో తొలకరించిన తొలికాన్పు, ఏకైక సంతానమూను అవడంవల్ల అల్లుణ్ణి యిల్లరికం తెచ్చుకున్నాడాయన భార్యకూడా లేకపోవడంవల్ల. కానీ శకుంతలతల్లి అతణ్ణి నడిసముద్రంలో...ముంచేసి వెళ్లిపోయింది. శకుంతల్ని తల్లిలేని బిడ్డగా చేసేసి. భార్య పోగానే అల్లుడు అమెరికా వెళ్లిపోయి అక్కడే ఎవర్నో పెళ్లిచేసుకుని ఉండిపోవడంవల్ల శకుంతల భారమంతా తాతగారి మీదే పడింది.

అంత్యదశలో కలిగిన ఆపదలకి కళ్లు తుడుచుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడాయన. ఆయనొక ఉన్నత కుటుంబానికి చెందిన రిటైర్డ్ ఆఫీసరు. స్వగ్రామం శ్రీకాకుళంలోనే స్వగృహంలో కాలుమీద కాలేసుకుని పించన్ రాళ్లతో సంసారం గడుపుతూ ఆర్జించిన పాతికవేలూ కట్నంకోసం!...వెంకటేశ్వర ముడుపులా మూటకట్టాడు ముట్టుకోకుండాను!...

శకుంతల చక్కనిచుక్క. సర్వాంగసుందరి. వయసుతో పాటు వసంతంకూడా అంకురించింది. పద్ధెనిమిదేళ్ల పండు వెన్నెల్లో ప్రపంచ ప్రవృత్తుల్ని గిలిగింతలుపెట్టే ఆమె అందం చూస్తూంటే ఆకలి దప్పులుకూడా విస్మరించగలరు! అందానికి హద్దులేదు. కట్నాని కంతకన్నా కరువులేదు. కానీ అను కున్నంత మంచిసంబంధం ఎక్కడా ఎదురవకపోవడంవల్ల బంధు వర్గమంతా శకుంతల పెళ్లిని గురించి తొందర చేస్తూన్నా తాత తమాయించి ఊరుకున్నాడు.

అందుకే ఆవేళ ప్రకటన అతన్ని అమితంగా ఆకర్షిం చింది. అదృష్టం ఆహ్వానించి నట్లుగా వజ్రంలాంటి సంబంధం వచ్చిపడింది. పిల్చి పిలవడంతో!

వజ్రంలాంటి వరుడు వచ్చాడు! ఇంజనీయరు. రూప యవ్వన లావణ్యాలకి తోడు బృహస్పతిలాంటివాడు దొరకాడు. గొప్పింటి బిడ్డ! అతని వాటాకి వంద ఎకరాల పొలం, పాతిక వేల విలువగల మేడ! లక్షరూపాయల రొక్కం! ఇంకేం కావాలి? శంకరాన్ని గురించి పుట్టుపూర్వోత్తరాలు, వంశ మర్యాదలు, కులగోత్రాలు, మొదలైన మంచిచెడ్డలన్నిటికి అనుకూలమైన ఆచోకీ అందుకుని సంబంధం స్థిరపరచుకున్నారు ఉమామహేశ్వరరావుగారు!

కొన్నాళ్ళు తనింట్లో అతన్ని తీర్చిదిద్ది, శంకరానికి శకుంతలనిచ్చి సామాన్య పద్ధతిగానే సాలంకృత కన్యాదానం చేసి స్వేచ్ఛగా శ్వాస...వదిలాడు తాత! తను చేసిన పనికి

7

మురిసిపోతూను. తలిదండ్రులు లేకపోయినా శకుంతల అదృష్టానికి ఆనందించారందరూను.

శంకరం పాశ్చాత్య విద్యాప్రాభీణ్యుడవడంచేత అంతా ఫారిన్ పద్ధతుల్లోనే తయారయ్యేవాడు. అందుకే స్వభావసిద్ధమైన సిగ్గు తెరలలో సౌదామినిలా మిరుమిట్లు కొల్పే శకుంతల్ని సర్వశక్తులా స్వవశం చేసుకోగల్గాడు. శకుంతల పిరికితనం సిగ్గు లోకాతీతమైంది. ఒకప్పుడు శకుంతల సిగ్గుచూసి పెళ్ళిపీటల మీద మొగాడితో కూర్చుటుందో కూర్చోదో నన్న భయంకూడా కల్గేది. అట్లా ఆడవాళ్ల ముందుకూడా సిగ్గుతో శిరమెత్తని శకుంతల అలా రాత్రింబగళ్ళు—ఒకళ్ల నొకళ్ళు రాత్రింబగళ్లు ఒక్క నిముషం కూడా విడిచిపెట్టక సినిమాలకి, షికార్లకి, చేలగట్లకి బయలుదేరడం చూస్తే అందరికి ఆశ్చర్యం వేసేది. అలా అతుక్కుపోయి తిరగ్గల్గుతూన్నందుకు, అలా వశపరచుకో గల్గినందులకు అతన్నందరూ అభినందించకుండా ఉండలేకపోయారు. అతను చాలా అనుభవజ్ఞుడు. "సహన సాహసాదులతో సాధించగల పని సానుకూలం కాకమానదని" అతని గట్టినమ్మకం ; జీవన ధ్యేయమూనూ, దాని కనుగుణ్యంగా ప్రవర్తించి ప్రకృతి శక్తుల్ని వశపరచుకోగల వ్యక్తి కావడంవల్ల శకుంతల్ని నిముషంలోకి వశపర్చుకో గల్గాడు. ఇద్దరు ప్రతి నిముషమూ ఒకర్ని మించొకరు ప్రేమానురాగాలతో ఒకరియందొకరు ప్రతిఫలింప జేసుకుందుకే ప్రయత్నించేవారు. ఇద్దరిలోనూ శంకరమే సర్వశక్తులా భార్యని బానిసగా చేసుకోగల్గాడు. శకుంతల యిప్పుడు అతను గీచిన గీటు దాటదు. అనుక్షణమూ అనుసరించి అల్లరిచేస్తూనే

ఉంటుంది. చెవులు కొరుకుతూ, చెంపలు గిల్లుతూ, చంటిపిల్లలా ఆడుకునేది, ఒళ్ళో కూర్చుని ఒయ్యారములు ఒలకబోస్తూను ! "కళ్ళు మూసుకోండి.! " అంటే అతను చెవులు మూసుకునే వాడు. "నోరు తెరవండీ ?" అని ఆజ్ఞాపించేది. శంకరం చవులు మూసుకుని నోరు తెఱచేవాడు. తను ఎడమచేత్తో అతనికళ్ళు మూసేసి కుడిచేత్తో "గులాబ్ జామ్" నోట్లో కుక్కేది ! అతను గులాబ్ తిన్న అధరంతో శకుంతల గులాబ్‌లాంటి అధరానికి అమృతం వర్షించేవాడు. ప్రేమ ప్రవాహంలో మునిగితేలుతూ ముచ్చటగా మూడువారాలు గడిపేశారు మూడు నిమిషాల్లో. ప్రేమప్రవాహంలో ఈది ఈది, అలసిపోయాడు శంకరం ! అక్కడితో అతనిశక్తి సన్నగిల్లింది.

పదహారు రోజులూ పండువెన్నెల్లో పరుగెట్టి పోయాయి తెలియకుండానే... ఆవేళ పదహారురోజుల పండుగ కూడా అయిపోయింది. అతను ప్రయాణానికి బెడ్డింగు చుట్టడం ప్రారంభించాడు. ఆవేళ అనిపించింది ఉమామహేశ్వరరావుగారికి శకుంతల పెళ్లి అయినట్లు శకుంతల ప్రయాణం సంగతి చెవిని పడగానే, ఆవేళ శకుంతల తల్లి చచ్చిపోయినట్లనిపించింది. చెప్పలేని గాబరా బయలుదేరింది ఆయన హృదయంలో...

శకుంతల చాలా హడావిడిగా సామాను సర్దుతూంది. పేకింగులన్నీ చూసి శంకరం - "శకుంతలా ! ఏమిటి ఈ సామానంతాను ? ఏకంగా యిల్లుకి యిల్లే మోసుకొచ్చేట్లున్నావే ! ఇల్లేకాదు — పోనీ ఊరికి ఊరే మోసుకురా ! " అన్నాడు వ్యంగ్యంగా.

అక్కడికి వెళ్ళాక అన్నీ తడుముకోవడ మవుతుందా! ఏ వస్తువు లేకపోయినా గడవదుగదా! అన్నీ ఉండికూడా ఇబ్బంది పడడ మెందుకని?... "సిబ్బందితో బయలుదేరుతున్నా వన్నమాట! హుఁ... మనం యిలా బయలుదేరుతే రైలుకి రైలే మాట్లాడుకోవాల్సి ఉంటుంది! చూడూ... ఒక్క పెట్టి, ఒక్క బెడ్డింగు చాలు. చూడూ... బాధ్యతలు బరువులు లేకుండా బ్రతకడం నేర్చుకోవాలి!"

"మరీ... భోజనం?..."

"నువ్వు యింత అమాయకురాలివేమిటి?... ఊరు గొడ్డుపోయిందా! ఎవర్ రెడీగా ఎదురయ్యే రెడీమేడ్ ప్రపంచంలో బ్రహ్మాస్త్రమెందుకు!..." "అయితే సత్రం భోజనం... మఠ నిద్రానా!..." "అబ్బెబ్బే! డబ్బు భోజనమూ... ధన శయ్యానే! బెంగుళూరులో అరంతస్థుల హోటలు మేడలో... కన్నుల వైకుంఠంలాగుంటుంది! రాత్రి రంభల్లా ముస్తాబులై జంటలుజంటలుగా తయారవుతారక్కడ! ఎక్కడలేని ప్రేమికులూ ప్రత్యక్షమవుతారు. చూడు! నువ్వుకూడా చాలా ఫ్రీయిలుగా ఉండాలి సుమా! సిటీల్లో సిగ్గుపడితే అంతా నవ్వుతారు. ఇంతకీ మనం ఒక్క నెల్లాళ్ళల్లో వచ్చేయం!" అంటూ ఆనందంలో ముంచేశాడు.

శకుంతల ఉత్సాహంతో ఉక్కిరిబిక్కిరి అయిపోయింది. నిజానికి జ్ఞానం వచ్చాక తనెప్పుడు రైలెక్కి ఎరుగదు. అందులోనూ అంతదూరం!... తల్చుకుంటూంటే శకుంతల హృదయం ఒక్కసారి ఎగిరి గంతేసింది ఆనందంతో. ఒక్కసారి సిగ్గు

సిరులతో పరవళ్ళు త్రొక్కుతూ ఒయ్యారంగా ఓర చూపులతో వచ్చి అతని ఒడిలోపడి కళ్ళుమూసుకుంది ఆనందం పట్టలేక !...

"చూడు శకుంతలా ! ఎల్లుండేగా మన ప్రయాణం ! వచ్చేటప్పుడు వరదక్షిణ తేవడం మరిచిపోయేవు సుమా నీ ఆనందంలో ! మిల్లుకి కట్టవలసిన బాకీ చెల్లించేస్తే...మిల్లంతా మన స్వాధీనమైపోతుంది. అప్పుడు మిల్లుకి నువ్వు రాణీ !... అయిపోతావు. ఆ మిల్లంతా ఎందుకైనా మంచిదని నీ పేరే పెట్టిస్తున్నాను ! ..." అన్నాడు అందంగా చూస్తూ.

"ఓస్ డబ్బా ! అదెంత సేపూ ! రేపీపాటికి బేంకిలోంచి రెక్కలుకట్టుకుని మీకాళ్ళముందు గంతులువేస్తాయి!..." అంది.

శకుంతల మాటలకి శంకరం హృదయంలో నెమళ్ళు పింఛంవిప్పాయి. ఒక్కసారి శకుంతలని బాహువుల్లో బంధించేసి ప్రేమవర్షం కురిపించాడు.

సరంజామంతా సర్దుకుని శనివారం ఉదయమే స్టేషనుకి వచ్చారు. ఆకాశమంతా ఎక్కడా తెరిపిలేకుండా నల్లమబ్బులతో నడుం వంగిపోయివుంది ! నీటిబిందువులతో బరువెక్కిన మేఘాల్లా ఉమామహేశ్వరరావుగారి కన్నీటితో నిండిన రెప్పలు బరువుగా పడుతున్నాయి ! పలకరిస్తే తొలకరించే మేఘాలు చినుకుల్లాగున్నాయి అతనికళ్ళు ! ఆసమయంలో అతన్ని చూస్తుంటే కణ్వుడిలా కనిపించాడు.

"అబ్బాయి శంకరం ! చూడు నాయనా ! ఆడదిక్కు, మొగదిక్కు నేనే అయి పువ్వుల్లోపెట్టి పెంచాను. ఎంత పెంచినా ఆడపిల్ల బరువే ! పరాయివాడి చేతిలో పెట్టగానే ఎరువై

పోతుంది! పాలముంచినా! నీటముంచినా నీదే భారం!" అన్నాడు రుద్ధమైపోతున్న కంఠంతో "ఏమిటో ఈ పెద్దవాళ్ళ హృదయాలే యింత! ఎంత పెద్దవాళ్ళయితే అంత ఎక్కువ చాదస్తం బయలుదేరుతుంది!" అనుకుంటూ భూమినుంచి సేకరించుకున్న నీటి బిందువులతో బరువెక్కి ఆమత్తులో గర్వంగా గర్జిస్తున్న మేఘాల్ని చూస్తూ నిలబడ్డాడు.

"చూడునాయనా! పాతికవేలూ జేబులో పెట్టుకున్నావు! జేబుదొంగ లుంటారు జాగ్రత్తసుమా! ఇద్దరూ కుర్రాళ్లు! కునుకుతీస్తే కొట్టేస్తారు." అంటూ దీర్ఘంగా నిట్టూర్చాడు తాత. కుఱ్ఱాళ్ళకి చెప్పినట్లు చెప్పడం చూస్తుంటే శంకరానికి అతనిమీద అమితంగా జాలేసింది! "జేబుదొంగలుంటారు!" అమాటలకి శంకరం ఆపుకోలేనంతగా నవ్వేశాడు! జేబుదొంగ లేమిటి? గజదొంగలు, ఘరానాదొంగలూ వీళ్ళనెవర్ని పాపం ఎరిగుండడీ ఆఫీసరు. ఆయన అమాయకత్వానికి లోపల్లోపలే నవ్వుకుంటున్నాడు శంకరం. "లక్షాధికారుల నెత్తిన చెయ్యిపెట్టిన అందెవేసినచెయ్యి అని ఆయనకేం తెలుసు పాపం!" అనుకుంటూ నివురు కప్పుతూన్న సిగరెట్టుని ఒక్క దమ్ములాగి అవతల పారేశాడు శంకరం.

ఇంతట్లోకే శరవేగంతో ధూమశకటం ధూంధాములు చేసుకుంటూ నిప్పులు గ్రక్కుకుంటూ వచ్చి నిల్చుంది, వికటాట్టహాసంగా ఒకవెట్టికూతకూసి, మోసానికి మొఱపెట్టుకున్నట్లు-ప్రయాణీకులంతా నురుగులు గ్రక్కుకుంటూ పరుగులెట్టి అందుకుంటున్నారు రైలు. ఆ స్టేషనులో రైలు రెండుమూడు

నిమిషాలకంటే ఎక్కువసేపు ఆగదు. ఆరెండు నిమిషాల్లోను స్టేషనంతా తలక్రిందులైపోతూ ఉంటుంది. మనుషులు మారి పోవడం, సామానులు మరచిపోవడాలూ జరుగుతూ ఉంటాయి. కాళ్ళు చేతులు కుమ్ముకుని రెక్కలు విరుచుకుంటారు. శంకరం కూడా సామాను పెట్టెలో పెట్టించి శకుంతలని జనానాలో ఎక్కించి తనువెళ్ళి రైల్లో ఎక్కి కూర్చున్నాడు.

ఉమామహేశ్వరరావుగారు రెప్పవెయ్యకుండా చూస్తూ నిల్చున్నారు, రైలు కదిలేవరకూను. రెప్పపాటులో రైలు రొప్పుకుంటూ రోజుకుంటూ రంకెలువేస్తూ, అందరి కళ్ళల్లోనూ దుమ్ముకొట్టుకుంటూ దూరంగా దూసుకుపోయింది. శకుంతల కళ్ళు చెమ్మగిల్లాయి. శంకరం స్తిమిత పడ్డాడు. ముసలాయన ఒక్కసారి ఖండువాతో కళ్ళు తుడుచుకుని ఒక్కసారి రైలు కొట్టిన దుమ్మును దులుపుకుని ఖండువా భుజాన్నేసుకుని నీర సంగా బయలుదేరాడు అడుగుల్లో అడుగులేసు కుంటూను. ఆకాశంమీద తెల్లమబ్బులు తేలికగా తేలిపోతూ, అతనితో కూడా వచ్చి యింటిదాకా సాగనంపాయి. ఆవేళ అనిపించిం దాతనికి అతను చాలా ముసలివాడై పోయినట్లు.

## 2

రైలు రెక్కలుముక్కలు చేసుకుంటూ, ప్రయాణికుల్ని వాళ్ళవాళ్ళ గమ్యస్థానానికి చేరుస్తూ సాగిపోతూ...ఉంది ! ఆడవాళ్ళ కంపార్టుమెంటులో స్థలం చూసుకుని కూర్చుంది శకుంతల. రైల్లో అందయా ఒక్కనిముషంలోనే ఒక్కరైపోయి

కబుర్లతో రైలుని అది నడవవలసిన వేగంకంటే అధికంగా నడిపించేస్తున్నారు. అది సెకండ్ క్లాస్ కాబట్టి అంతగా క్రిక్కిరిసి లేదు కంపార్టుమెంటు. లేడీడాక్టర్లు, నర్సులు, టీచర్లు, కాలేజీ గరల్సు, ఆఫీసర్సు భార్యలూ...గృహిణులు... నానాజాతిసమితి రంగు రంగుల్లోను వెలిశారు. అంతా ఆడమళయాళము అయినా చదువుకున్న వాళ్ళతో చనువులేదు తనకి! నాగరికులతో నవ్వడం చేతకాదు కనక పార్వతమ్మగారితోటి పరిచయం ఏర్పడడంవల్ల ప్రయాణం ప్రసన్నంగానే నడిచింది. తన భర్త జంతునులోనూ జత కలుపుతూనే ఉన్నాడు. పార్వతమ్మగారి కబుర్లతో కాలక్షేపం చేస్తూంటే కాలం, గంటలు నిముషాల్లా గడిచిపోతున్నాయి. రైలు చుట్టూ ప్రపంచమంతా "భూమి గుండ్రముగా తిరుగును" అని పాఠం నేర్పుతూవుంది. తన కళ్ళ ముందు తిరిగిపోతూన్న ప్రపంచంలోంచి మధ్యమధ్య స్టేషన్లు తనని మేల్కొల్పి భౌతిక ప్రపంచంలోకి తీసికుని వెడుతూంది. శంకరం ప్రతి స్టేషన్లోనూ కాఫీ టిఫిన్లు, టైముటైముకి తెచ్చిపెట్టే వాడు. పార్వతమ్మగారు కూడా పిల్లలతో ఒంటరిగా ప్రయాణం చెయ్యడంవల్ల తగిన సదుపాయాలు శంకరం ద్వారా జరుగుతూండేవి! పార్వతమ్మగారు తమ దాంపత్యాన్ని చూసి ఎంతో మురిసిపోయింది. తమరిద్దరూ అందంలో యిద్దరికిద్దరూతీసిపోరు. స్వభావాలు కూడా యించుమించుగా ఒక్కటే. తమరిద్దర్ని తు. చ. లు తప్పకుండా సృష్టించగల్గినందులకు భగవంతుడికి మనస్సులోనే వెయ్యి నమస్కారాలు చేసింది శకుంతల. చివరికి పార్వతమ్మగారు చూసిచూసి "మీరు మేనత్తమేనమామ పిల్లలా!"

అనేసింది పట్టలేక. దాంతో శకుంతల అదృష్టం మరీ ఆరంగుళాల పొడవైంది. "కాదని" గర్వంగా కళ్ళతోనే జవాబుచెప్పింది ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ తన అదృష్టానికి తన్మయమై పోతూను. తన అడుగుఅడుగులోను అదృష్టం అడుగులేస్తూ న్నందుకు ఆనందంతో పరవశమైపోతూంది శకుంతల.

సరిగ్గా రాత్రి తొమ్మిదై ఉంటుంది. విజయవాడ స్టేషను వచ్చింది, విద్యుద్దీప మాలికలతో విరాజిల్లుతూను. పట్టపగలులా వెయ్యి సూర్యుళ్ళు ఉదయిస్తూన్నట్లుంది స్టేషనంతాను. ఒక్కసారి భూమి ఈనిందా అన్నట్లు స్టేషనంతా ప్రయాణికులతో నిండి ఉంది. శంకరం వచ్చి శకుంతలనితీసికెళ్ళి భోజనం పెట్టించి మళ్ళీ బండిలోఎక్కించాడు. సీటులోకూర్చుని స్థిమితపడ్డాక "నీకేమైనా డబ్బు కావాలా ?" అడిగాడతను ప్లాటుఫారంమీద రైలుకిటికీకి దగ్గరగా నిలబడి శకుంతల కళ్ళల్లోకి చూస్తూను. తలవనితలం పుగా వచ్చిన ఈ ప్రశ్నని శకుంతల మొదట తట్టుకోలేక తబ్బిబ్బైంది. "తనకి డబ్బెందుకు ? .. పెన్నిధిలాంటి పతి ఉండగా ! తనకి డబ్బెందుకు ? అందులోనూ అర్ధరాత్రివేళ !"... "నాకు డబ్బెందుకు ?" నవ్వింది నాజూగ్గా అతనికేసి చూస్తూ శకుంతల ఆశ్చర్యం గాను !... "డబ్బెందుకేమిటీ ?" అతనికి అంతకన్నా ఆశ్చర్యమేసింది శకుంతల అమాయకత్వానికి ! "డబ్బెందుకేమిటీ ?... అయినా ఎందుకైనా ఉంటుంది ఉంచు! ..." అని ఒక పది రూపాయల నోటు మార్చి ఒక సిగరెట్టు పాకెట్, అగ్గిపెట్టి, పువ్వులు, రెండు కిళ్ళీలు కొని తక్కిన చిల్లరంతా పర్సులోవేసి రుమాలుతో గట్టిగాబిగించి అందించి

అలాగే రైలు కదిలేదాకా శకుంతల కళ్ళల్లోకి చూస్తూ సిగరెట్టు కాలుస్తూ నిల్చున్నాడు నిశ్శబ్దంగా!... తనుకూడా అలాగే రైలు కిటికీలోంచి సిగరెట్టు పొగలు అందించే సందేశాన్ని తిలకిస్తూ కూర్చుంది.

అంతలోనే గార్డు విజిల్ వేశాడు. రైలు కూతకూసింది. అందరు హడావిడిగా ఒకర్ని తోసుకుని ఒకరు ఎక్కేస్తున్నారు. ఎంత సేపు రైలాగినా చివరి నిముషంలోనేగాని చురుకుపుట్టదు గాబోలు! ఈ వింతప్రకృతికి విసుక్కుంటూ ప్లాటుఫారంమీదకి చూస్తూ కూర్చుంది. రైలుకదిలింది. అందరూ రుమాళ్ళు విసురుతున్నారు. ప్లాటుఫారంమీద ప్రజలు బిక్క మొహాలతో రైలు కదలికలనుగమనిస్తూ చైతన్యంతప్పి చూస్తూ నిలబడిపోయారు. అతనో?... అతనెవరు?... అరే తన భర్త... ఎక్కడేం యింకాను? ఎప్పుడూయింతే! రైలెక్కినప్పటినుంచీ చూస్తూంది. ఎంత సేపాగినా రైలు కదిలితేనేగానీ ఎక్కడు. ఏం నవనాగరికతో కానీ!... కర్మకాలి!... కాలు జారితే?... ఎందుకో ఒక్కసారి భయం బయలుదేరింది. తల్చుకుంటూంటే ఉలిక్కి పడింది హృదయం. కిటికీలోంచి బయటికి చూసింది ఒక్కసారి. రైలు ప్లాటుఫారం మీదినుంచి దాటి చాలాదూరం వచ్చేసింది. ప్రమాదాలేవీ సంభవించలేదు భగవంతుణ్ణి ప్రార్థించుకుంటూ సృష్టిని కలియజూసింది. పండువెన్నెల ప్రకృతినంతా పరవశం చేస్తూంది. నిర్మలంగా ప్రవహించే సృష్టి నీడల్లో నింగినుంచి పరిహాసిస్తూన్న నిండుపున్నమచంద్రుడు తన్ని చూడగానే మబ్బు తెరల చాటున దాక్కున్నాడేం? రైలు కూడా బ్రిడ్జి వదిలేసి

వేగం హెచ్చించింది. ప్రపంచంతో పాటు తనుకూడా కళ్ళు మూసింది శకుంతల. నిద్దట్లో కూడా ప్లాటుఫారంమీద సిగరెట్టు త్రాగుతూ నిల్చున్న శంకరమే ప్రత్యక్షమవుతున్నాడు. అయ్యో ఎక్కడేం? ఎంతకీ ఎక్కడుబాబూ! ప్లాటుఫారం మీదగానీ ఉండిపోలేదు గదా! నిద్దట్లో కలవరించి ఉలిక్కిపడింది రెండు మూడుసార్లు. అందరూ హాయిగా గుండెలమీద చేతులేసుకుని నిశ్చింతగా నిద్రిస్తున్నారు. ప్రపంచమంతా యథాప్రకారంగానే నడుస్తూంది. బయట బాగా చీకటిగానే ఉంది! మళ్ళీ ఎప్పుడో తనకి తెలియకుండానే నిద్రపట్టేసింది!

మళ్ళీ ఎప్పుడు తెల్లవారిందో తెలియదు. ప్రపంచమంతా అప్పుడే పాతబడిపోయింది. ప్రయాణీకులంతా పక్కలు చుట్టేసి పగటి ప్రపంచంలోకి ప్రయాణమవుతున్నారు. తనుకూడా లేచి కూర్చుంది; బేసిన్‌బ్రిడ్జి స్టేషనులో రైలాగింది. శకుంతల కళ్ళు శంకరంకోసం తెగవెతికాయ్. "ఎంతకీ రాడే? ఎప్పుడూ యింతే! అవతల కొంపలు మునిగిపోతున్నా సరే తొమ్మిదైతేనేగాని లేవడు. బెడ్ కాఫీ పడితేనే అప్పటికైనా చలనం గలగడం! అది త్రాగిన గంటకిగాని నిషాఎక్కి నిక్కినీల్గి లేస్తాడు. ఇలాంటి మనిషి టైముకు ఆఫీసుకు ఎలావెడతాడా" అని ఆలోచిస్తూ కూర్చుంది.

టిక్కెట్టు కలెక్టర్లు తండోపతండాలుగా తరలి వచ్చారు, కిళ్ళీలు నములుకుంటూను. పెట్టిపెట్టీ ఒక్కొక్కడే పరీక్షిస్తున్నారు. తన పెట్టెలోకి కూడా ఒకడు ఎక్కాడు. అందర్నీ టిక్కెట్టు అడుగుతున్నాడు. అయ్యో! తనభర్తయింకా లేవలే!

టిక్కెట్లు అతనిదగ్గరే ఉండిపోయాయి. వీళ్ళేమంటారో ఏమిటో! కాళ్ళు గడగడలాడాయి. గుండె దడదడమంది. ముచ్చెమటలూ పోస్తున్నాయి. ఎముళ్ళాగ రానేవచ్చాడు తన ముందరికి "ఒకావిడ" టిక్కెట్లు మొగాళ్ళదగ్గరున్నాయని బుకాయించింది. మళ్ళీ మాట్లాడలేదు టిక్కెట్టు కలెక్టరు. ఎంతమంచి ఉపాయం! ఇంత సత్యాసిజమైన సంగతే తనకి చెప్పడానికి చేతకాలేదు. కొంచెం ధైర్యాం వచ్చింది శకుంతలకి. తన పథకం కూడా పారింది. టిక్కెట్టు కలెక్టరు తన్ని కూడా ఏమీ అనలేదు. అవతలి బర్తులో కూర్చున్న యిద్దరాడాళ్ళని పట్టించారుపాపం! కులాసాగా తమలపాకులు నములుకుంటూ కూర్చున్న యిద్దర్నీ నిలవేసి ఒక్క ఉరుము ఉరిమి పోర్టర్ల చేత సామానూను దింపించేశాడు. ఇద్దరూ అతని వెనకాలే వెళ్ళారు. ఏమైందో తెలియదుగానీ, చాలాసేపు అరవంలోనే ఘర్షణ జరిగింది. ఎక్సెస్ చేసి మరీ వదలిపెట్టారు. "మోసం చెయ్యడానికి మనస్సెలా వచ్చిందీ!" అంది తను పార్వతమ్మగారితో ఆశ్చర్యంగా!

"మోసానికి మొహమాట మేమిటీ!" అని నవ్వుకుంది పార్వతమ్మగారు తన అమాయకత్వానికి.

మళ్ళీ ఒక్కదెబ్బతో రైలు అందర్నీ అయిదు నిముషాల్లో మద్రాసు స్టేషనుకి ఈడ్చుకొచ్చి పారేసి "అమ్మయ్యా!" అని ఆయాసంతో నిలబడిపోయింది అలసట తీర్చుకుంటూను. "కూలీ! కూలీ...కూలీ!" ఈ పోర్టర్ల హోరెక్కువైపోయింది మరీను. కందిరీగల మోతలాగ. అడగకుండానే సామానులు అందుకుపోతున్నారు, చేతిలోవి చేతిలోంచేను. "కొంపతీసి తన సామా

నులు తమరివని దింపుకుపోరుకదా ! ఈ గందరగోళంలో" అని వెయ్యికళ్ళతో చూసుకుంటూంది సామానును తను. అది అసలే మద్రాసు. అందులోను అరవమేళం ! మోసానికి పుట్టిల్లు.

పార్వతమ్మగారి భర్త రెక్కలు కట్టుకొని వచ్చివాలాడు భార్యా బిడ్డలకోసరం ! ప్రయాణ పరిచయానికి ఫలితంగా తన కేసి చూసి ఒక్కనవ్వునవ్వి వెళ్ళిపోయింది పార్వతమ్మగారు. డాక్టరు, నర్సులు, టీచర్లు కూలీల తలమీద సామాను పెట్టించి చెకచెకా నవ్వుకుంటూ వెళ్ళిపోతున్నారు. ఎంతధైర్యం వీళ్ళకి ! స్వతంత్రంగా చెలామణి అయిపోగల శక్తిఉంది వీళ్ళకి ! ఆశ్చర్యపోతూ తను మద్రాసు, బెంగుళూరులో భర్తతో ఎంత నవనాగరికతతో మెలగాలోనని ఊహించుకుంటూ కూర్చుంది రాబోయే అదృష్టాన్ని గురించి తల్చుకుంటూను.

అందరూ వెళ్ళిపోయారు! తను అలాగే కిటికీలోంచి తల పైకిపెట్టి చూస్తూ కూర్చుని ఉంది శకుంతల ! పదినిమిషాలై పోయింది. ఇంకా శంకరం రాలేదు. స్టేషనొచ్చినా యింకా నిద్రపోతున్నాడేమిటి చెప్మా ! ఈసారి తనకెందుకో చాలా కోపం వచ్చింది. లేకపోతే ఏమిటి ? ఎంతకీరాడు ! ప్లాటుఫారం మీద ప్రతిబింబించే ప్రతి మొహాన్ని పరకాయించి చూస్తూంది. మనిషి అయిపులేడు. ఆలస్యమైనకొద్దీ ఆవేదన బయలుదేరింది. మళ్లీ యిది అసలు మద్రాసు స్టేషను ఔనో కాదో ! లేకపోతే ఎందుకురాడూ ? సందేహంతోంచి ఒక కూలీ కుఱ్ఱాణ్ణి పిలిచి "ఏ అబ్బాయి ! యిది మద్రాసు స్టేషనేనా ?" అని అడిగింది.

"అమ్మా! సామాను యిరుక్కా!" అన్నాడు వాడు కూలికోసరం.

"ఈబండి యింకెంతదూరం వెడుతుంది ?" అంది తను. కాని వాడి కర్థం కాలేదు. ఇంతలోకే రైల్వే కానిస్టేబుల్ వచ్చాడు. "ఏమోయ్! ఈబండి యింకెంత సేపు యిక్కడ ఆగుతుంది ? అడిగింది ఆదుర్దాగా!

"ఇది యిక్కడదా నిల్చి పూడుస్తాది. తిరుంబి రాత్రిదా పూడుస్తుంది" అని తన అమాయకత్వాన్ని కనుక్కొని "ఎక్కడా పోతావు ?" అన్నాడు. తనకేం సమాధానం చెప్పాలో అర్థంకాలేదు. తనెక్కడికెడుతుంది ? మళ్లీ టిక్కెట్టు కలెక్టరొచ్చి టిక్కెట్టు అడిగాడు.

"మొగాళ్ళ దగ్గరుంది" అంది తను మామూలుగానే కాని ఈసారి వాళ్ళు యిందులో ఏదో కుంభకోణం ఉందనుకుని వేళాకోళంగా చూస్తున్నారు.

"మొగాడుదా లేదే ?" అన్నాడు కాన్‌స్టేబుల్.

"సెకండు క్లాసులో ఉన్నారు. చేతిలో లెదర్ పోర్ట్ ఫోలియో కూడా ఉంటుంది. దానిమీద S. S. Sarma అని పేరు కూడా ఉంటుంది" అంది తను. తన అమాయకత్వానికి అంతా పగలబడి నవ్వారు.

"అట్లాంటి మనుషులెవరూ దిగలేదే?" అన్నాడు టికెటు కలెక్టరు.

"నిద్దట్లో బండిలోనే ఉండిపోయారేమో ఒక్కసారి పెట్టెలన్నీ చూడండి" అంది తను మరీ అమాయకత్వంగా.

"మీరు ఎక్కడెక్కారు?" అన్నాడు ఒకతను నవ్వు కుంటూను.

"శ్రీకాకుళంలో!"

"ఏ స్టేషన్ దాకా మీరతన్ని చూశారు?" మళ్ళీ ప్రశ్నించారు.

"విజయవాడ" అంటూ వొణుకుతూ చెప్పింది తను.

"స్ట్రూడుంగో సార్! మొగవాళ్ళకి కొదవ ఏమి సార్! పట్నంపోతే పత్తుపేరు!" అంటూ విరగబడి నవ్వుతున్నాడు కాన్‌స్టేబుల్ గాడిదకొడుకు! తనకు ఉక్రోషం పొర్లుకొచ్చింది. దుఃఖం దొంతర్లు దొర్లుకొస్తూంది. కళ్ళముందు ప్రపంచమంతా గిరగిరా తిరిగిపోతూంది. కళ్ళు చీకట్లు క్రమ్మిపోతున్నాయి. సిగ్గు శరీరాన్ని చీల్చేస్తూంది. అపాదమస్తకమూ వణికిపోతూంది తను. ఇంతకీ తనభర్త ఏమైనట్లు? రైలెక్కుతూంటే రైలుక్రింద గానీ పడిపోలేదుగదా! లేకపోతే ఏమైనట్లు? విజయవాడదాకా వచ్చాడు. ఆ దృశ్యం తన కళ్ళని కట్టినట్లు కనిపిస్తూంది. ఔనని తన హృదయం సాక్ష్యం చెబుతూనే ఉంది. అతను ఎక్కేలోపల కదిలిపోయిఉంటుంది. లేకపోతే ఎందుకు రాడూ? తనని ఒక్క నిముషంకూడా వదిలిపెట్టలేక స్టేషను స్టేషనుకి హాజరయ్యేవాడు గదా! వెధవ రైలు కదిలిపోయేఉంటుంది. లేకపోతే రైలాగే టప్పటికి రెక్కలుకట్టుకుని వాలడూ? ఎంతబాధ పడుతున్నాడో ఏమిటో? "బెజవాడలో రైలు కదిలిపోయిఉంటుంది. సాయంత్రం Express కి గానీ, రేపు మెయిలుకిగానీ వస్తారు. భయపడకండి!" అని ఓదార్చి, "ఈ ఊర్లో మీ కెవరైనా

ఉన్నారా ?" అడిగాడు ఆత్రంగా ! అప్పుడు జ్ఞాపకంవచ్చాడు శ్రీహరి తనకి. టికిట్ కలెక్టరు తనతో ఇంగ్లీషులో మాట్లాడి వాడికి అడ్రసు చెప్పి తనని సానుభూతితో సాగనంపాడు. అతనికి మనస్సులోనే ధన్యవాదాలర్పించుకుంటూ టాక్సీ ఎక్కేటప్పటికి టవర్ క్లాక్ పదికొట్టింది. తను కూర్చునీ కూర్చోవడంతో టాక్సీ యమస్పీడులో పోయి శ్రీహరి యింటిముందాగింది. శ్రీహరి కూడా అప్పుడే ఆఫీసుకి బయలుదేరపోతూ ఉన్నాడు. అతన్ని చూడగానే కార్లోంచి ఒక్కఉరుకు ఉరికింది శకుంతల. సామాను తెచ్చిపెట్టి పైసలు పుచ్చుకుని బయలుదేరి పోయాడు టాక్సీ వాడు. శ్రీహరి తెల్లబోయిచూస్తూ నిలబడిపోయాడు. శకుంతలకి అతన్ని చూడగానే ప్రాణం లేచివచ్చింది. "అన్నయ్యా !" అని ఒక్కరిసా పిచ్చిదానిలా అరిచింది.

"ఏమిటి శకుంతలా ! ఏం జరిగింది. ఇలా ఒంటరిగా ఉత్తరం పత్తరం లేకుండా వచ్చావేమిటి?" గుక్కత్రిప్పుకోకుండా ప్రశ్నలవర్షం కురిపించాడు శ్రీహరి. శకుంతలస్థితిచూసి చాలా ఖంగారు పడ్డాడు అతనుకూడా.

"ఆయన తప్పిపోయారన్నయ్యా !" అంది అమాయకంగా. ఆయన తప్పిపోవడ మేమిటి ? అతనికి శకుంతల అమాయకత్వానికి జాలి నవ్వు రెండు వచ్చాయి. తమాయించుకుని అన్నీ అడిగాడు. పూసగ్రుచ్చినట్లు చెప్పేసింది. గుమ్మంలో నిలబడ్డమనిషి నిలబడ్డట్టుగానే అంతావిని శ్రీహరి లోపలికి తీసికునివెళ్ళి దగ్గరుండి భోజనం పెట్టించి సానుభూతి చూపించాడు.

కానీ అతని కెందుకో ఏదో కుంభకోణం జరిగిందని అంతరాత్మ అందిస్తూనే ఉంది.

శ్రీహరి మద్రాసు ఎకౌంటు జనరల్ ఆఫీసులో పని చేస్తున్నాడు. శకుంతల అతనికి స్వయాన పినతండ్రి కూతురే ! కానీ, పినతండ్రి దూరమవడంతో శకుంతలతో కూడా అంత చనువు ఉండేదికాదు. తను తనతండ్రికి ఒక్కడే కొడుకు, తండ్రి చనిపోయాడు. శకుంతల పినతండ్రికి ఒక్కర్తే కూతురు. తల్లి చనిపోయింది. అందుచేత శకుంతలంటే అతనికి అమితప్రేమ, రెండురోజులు రాత్రింబగళ్ళూ రెండుపూట్ల రైళ్ళు గాలించారు శంకరం జాడేలేదు. మూడురోజులు గడిచాక శ్రీహరి తనకి తెలిసున్న వాళ్ళందరికీ వైరిచ్చాడు.

మెల్లిగా వారందాటింది. ఆవేళ శ్రీహరి శకుంతల్ని గురించి ఏమిటేమిటో ఆలోచిస్తూంటే దమ్మిడీకానంత మొఖం చేసుకుని కూర్చున్న శకుంతల్ని చూస్తుంటే చాల జాలివేసింది. ఏమీటేమిటో ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఆవిడ కెదురుగుండా కులాసాగా కబుర్లుచెప్పి నవ్విద్దామని ప్రయత్నిస్తాడు. అప్పుడే పోస్టుమెన్ లెటర్సుయిచ్చి వెళ్ళాడు. శకుంతల తన భర్త దగ్గరనుంచి జాబైనా వస్తుందేమోనని కళ్ళు కాయలు కాశేలా చూస్తూఉంది. అతను అన్నీ చదువుకుని ఒక కవరు తన్ని చదవమనిస్తే నిజంగా తనభర్తే వ్రాశాడని పొంగిపోయింది. కానీ అలాయేం జరగలేదు. మళ్ళీ అతనికే అందించింది చదవ కుండాను. అతనే చదవడం ప్రారంభించాడు, అది అతని స్నేహితుడు బొంబాయినుంచి వ్రాసిన జాబు. చదివాడు—

మళ్ళీ చదివాడు—ప్రత్యక్షరమూ పట్టుతప్పకుండా చదివాడు.
"శకుంతలా ! వెళ్ళేటప్పుడు అతనిదగ్గర ఏమాత్రం సొమ్ముం టుందీ ?" అడిగాడు విచారంగా ఉత్తరం బల్లమీద పడేసి !

"కట్నం తాలూకు పాతిక వేలూ! జేబులోనే ఉన్నాయి!"

"ఇంకేం ! ప్రకటన ప్రభువని చెబుతూనే ఉన్నావుగా ! కట్నంకోసరం చేసినపని యిదంతాను. ఇంతకీ ఇంజనీరు బుర్ర కదూ ! ప్లాను పక్కాగ కుదిరింది. పదిరోజు లిక్కడుంటే— పదిసంవత్సరాలు ఫారిన్‌లో ఉంటాడుట ! అక్కడ యూరపి యన్ లేడీని పెళ్ళి చేసుకున్నాడుట కూడాను. మా స్నేహితు నికి బొంబాయి హార్బరులో పని. అతనిదగ్గర పాస్‌పోర్టు తీసి కుని పోయినవారమే ఓడ ఎక్కేశాడుట ! ఇంక అతన్ని అనుసరించడం అనవసరమని కూడా వ్రాశాడు."

"అన్నయ్యా ! నా భర్త యింక యింతేనా ? ఇంత అన్యాయమా ? ఎందుకిలాగై పోయింది ? కుప్పగా కూలి పోయింది శకుంతల.

"ఇదంతా కట్నంకోసం చెల్లీ !" నిట్టూర్చా డతను.

★

## కందుకూరి లింగరాజు

వీరు "భరణి" అనే పేరుతోకూడ వ్రాస్తూం టారు. 1939 నుంచి రచనల నారంభించిన వీరి కథానికలు, తదితరములు మూడునూర్లకు పైగానే ఉంటాయి. గ్రామీణ జీవితం, యువతీ యువకుల నిత్య జీవితాల్లోని ఒడుదుడుకులు వీరి ఇతివృత్తాలు. వీరి కథలు కన్నడం, ఇంగ్లీషు, హిందీ భాషల్లోకి అనువదించబడ్డాయి. విషాదాంత రచనలమీద వీరికి మోజు ఎక్కువ. 1954 లో ఆంధ్రపత్రిక నడిపిన కథానికపోటీలో "కోడలు" అనే కథకు ద్వితీయ బహుమతి పొందారు.

మంచి వక్త. లలితకళ లన్నిటిలోనూ కొద్దో గొప్పో ప్రవేశం ఉంది.

వీరి శైలిలో ఒక ప్రత్యేకత కనిపిస్తుంది. సంఘం పాటించే నీతిని తీవ్రంగా విమర్శిస్తూ, నిష్కల్మషంగా హృదయాన్ని విప్పిచెప్పే పద్ధతి కందుకూరి వారికి అలవాటు.

★

# "తెర వెనుక"

ఆ రోజుల్లో, నిండు వెన్నెలని, వికసించిన కలువని, గళ మెత్తిన గానాన్ని చూస్తే ఎంత ఆనందం కల్గుతుందో. అల్లాగే ఈ పగలల్లా కొట్టుకుని, కత్తులు, కఠార్లు, రక్తం చీములమధ్య జరిగిన ఘంటలన్నీకూడా, గుమ్మం ఎక్కేటప్పటికి, ఒకళ్ళ తర్వాత ఒకళ్ళుగా వచ్చే రామూ, గోపీ, ఆనంద్, శోభని చూస్తుంటే కల్గేది. నాకు వయస్సే చిన్నదయ్యేది. పుచ్చపువ్వులా వికసించు కుంటున్నానేమో అనిపించేది.

దీనికి తోడుగా, వయస్సుమళ్ళిన శరీరపు మార్పులు జ్ఞప్తికి రాబట్టో, ఏమో, సుందరికూడా మాటలు కాకుండా, చూపుల్తోనే కవ్వించేది. ఇద్దరం ఏం మాట్లాడుకోవాలి అనుకునే, హృదయాల్తోటి మాట్లాడుకునేవాళ్ళం. ఆ మాట్లాడుకోవడం లోని ఉన్మత్తత, యవ్వనంలోని కౌగిలింపుల్లా ఉండేది.

ఒక్కొక్కసారి అనుకునేవాళ్ళం. ఈ డాక్టరీలో ఆర్జించిన ఇల్లు, బ్యాంకులో ఐదంకెల మొత్తం నిల్వ, పదెకరాల మాగాణీ, కారు. చదువుకునే, రేపు నాకు ఆసరాగా తయారై కూర్చో డాన్కి, బుద్ధి మంతనంగానే పిల్లలు, ఇంకేం కావాలని.

ఈ ఆశను చంపుకోవాలనుకున్నాం. రోజూ దానంతట అది వచ్చి కూర్చుండేది. ఏంకావాలో అన్నది తెలియనేలేదు. తెలియకుండానే ఆవేదన వచ్చేది. అయినా పిల్లల కబుర్లల్లో, సుందరి చూపుల్లో దాన్ని మర్చిపోయేనేమో అనుకునేవాడిని.

ఈ ప్రయివేటు ప్రాక్టీసు పెట్టిన తర్వాతనే పెద్దవీధిలో నర్సింగ్‌హోమ్ పెట్టించే. పేటలో బ్రాంచి నడిపించే. వీటికి వత్సరాలు అయ్యేయి. తల కణతల ప్రక్కని నెరసింది. దీంతోనే ఒంటిగా వచ్చిన సుందరి, ఆ కాలంలో పిల్లల్ని చీమూ రక్తం నలుగురికి పంచి యిచ్చింది. జారిన యవ్వనం, పమిట ఒదలిన జవ్వనిలా మమ్మల్ని దర్శి్న చేసింది.

రోజూ, కోటుకు బొత్తములు పెట్టి, మందులబ్యాగ్ ఇచ్చి, దగ్గరసా ఓసారి గునుస్తూ చూచి పంపేది, సుందరి.

ఈ ఎర్రగా, పొట్టిగా, మధ్యపాపిడతీసి, దమ్మిడీ అంత బొట్టు, చిన్న పాదాల్తో, కుదుమట్టంగా ఉండే సుందరి మార్పు లేకుండానే సంవత్సరాలు గడిపేసనట్లుగానే, ఉండిపోయింది... ఆసుందరి...

ఇప్పుడు...ఈ కొద్ది గంటల్లోనూ...

"ఆపరేషన్ చేస్తాను...కాని ముందుగా నన్ను దీవించు" అనే థియేటర్‌లోకి వెళ్ళిన రంగా చేతుల్లోనే, జీవన్మరణాల మధ్య ఊగుతోంది.

నేనూ డాక్టర్నే అయినా...అసిస్టెంటు "ఏం డాక్టరు... ఆపరేషన్ చెయ్యమని ఒప్పుకున్నారా ?" అడిగేడు.

"ఒప్పుకున్నా."

ఆశ్చర్యంతో మొఖం త్రిప్పుకున్నాడు. 'ఇంత పెద్ద ఆప రేషన్, రెండు సంవత్సరాలైనా అనుభవంలేని ఆయన చేతుల్లో పెట్టేనని, అది ఒక్తి నామూర్ఖత్వం అని, దీనివల్ల పరిణామాలు...' ఆ దృక్పథంలోనే ఉన్నాయి చూపులు.

నాకు తెలుసు పరిణామం ఏమిటో అని. అయినా రంగాకంటె నాకు ఆప్తులు...రక్తబంధువు...ఇంకెవరున్నారన్న ఆశ, భావిలో నమ్మకం, నన్ను ఒప్పిదం చేసేయి. అంతకంటె ఈ కనిష్ఠ, గరిష్ఠాల్లోని భేదం ఆలోచిస్తూ కూర్చుంటే, సుందరి నాకు దక్కదని తెలుసు.

ఆ ఘంటల్లో అందర్ని అడిగే ఒక్కళ్ళూ రానేరాలేక పోయేరు. మేజర్, ఆపరేషన్...చదువుకున్న పెద్దపెద్ద డాక్టరు డిగ్రీలు...ప్రత్యేకించిన సర్జరీలు, ఇవన్నీ ఎందుకో ?...ఆరోజుల్లో చదువుకునేటప్పుడు...

పరిశోధనలు చెయ్యాలనే, అవిచేసే డిగ్రీ సంపాదించే, అందులోనూ ప్రత్యేకంగా చదివే, వాళ్ళు చెప్పినది. ఈపెద్ద పెద్ద పుస్తకాల్లోంచి ఎత్తే, కాని పిపాస ఒదల్లేక పోయింది. సృష్టి రహస్యాలు... ఎప్పటికయినా కృతకృత్యుణ్ణి కాలేక పోతానా?

ఆశ...ఈప్రాక్టీసుచేస్తున్నప్పుడూ నన్ను ఒదల్లేదు. అవి జరుగుతూనే ఉండేవి.

నా ఫలితాలు, ప్రయత్నాలు నారోగులమీదనే చేసే. వాటినన్నిటిని సమీకరించేవాడిని...

ఆ సంధ్యారాగంలో...

నిత్యానందం వచ్చేడు. ఆయన ధనికుడు. ఆస్థిపాస్తులు చాలా వున్నాయి. కాని వయస్సు మళ్ళినా సంతానం కల్గనే లేదు. తిరుపతికొండమీద మూడోసారి పెళ్ళిచేసుకుని వచ్చేడు పదహారేళ్ళ పసిడిబొమ్మని.

సంవత్సరం గడిచింది. మా మిత్రత్వంతోనే సంసారంలో పెంపుదల లేనందుకు విచారం కృంగదీస్తూనేవుంది. ఆశించేడు. ఎక్కడైనా ఆశే...

ఇంటికివచ్చి సుందరిని అడిగే. "రామూను పెంపకం ఇస్తావా ?" అని.

సుందరి నవ్వింది. "ఆయనభార్య అందచందాల సంరక్షణ లోనే ఉండిపోయిందికాని, మాతృత్వం యెడ ద్వేషంతో వుండి నట్లే కన్పిస్తుందేమో !" అంది.

నిత్యానందం! జీవితంలో చెయ్యిజారిన విషయాలు మననం చేసేడు. ఆఖర్నే...'కల్గుతారన్న ఆశ కన్పించటంలేదు.. అయినా నువ్వు ఓసారి పరీక్షించు...' తెగలేని ఆశలోనే.

హాస్పటల్లో మొట్టమొదటిసారి చూచే. సన్నటి గ్లాస్కో చీర, అదే పెద్దంచుల జాకెట్టు, గూడుపగలిన శీతాకోక చిలుక లావుంది. నేను తెల్లబోయే...అందం పొట్ట విచ్చుకుంది.

సుందరి, ఆ పోలికల ఛాయలోని రామూ, మర్చిపోయే. కలలుకన్నట్లే పిపాస తోడేసింది.

ఈ పోలికతో సంతాన్నం... నరాల్లుత్రోసేయి.

ఇవ్వాలనే మత్తుమందు ఇచ్చే...మనస్సులో ఆశ.

నర్సు ఎదో అనుకుంది...కురూపి అనుకున్నా.

ఆశ ఉములుకుంది. నా జీవాల్తో ఈ సృష్టి...

సుందరికి అన్యాయం చేస్తున్నానన్న తలంపేలేదు.

నిత్యానందంకు చెప్పే... "శరీరంలో తప్పు కన్పించటం లేదని..."

వ్యభిచరించేనా, అన్న మీ మాంసలో సుందర్ని చూడలేక పోయే ఆ మొదటిరోజున.

ఇవి రహస్యాలు. ఈ రహస్యం నాలోనే దాచుకుందామనే, నే చేసిన కృషి ఓ నూత్న అధ్యాయాన్ని విప్పుతుందనే, టీకగా వుంటుందన్న ఆశలోనే...చేసేనని అనునయం చేసుకున్నా. ఆరోజు సుందరితో మాట్లాడలేకపోయా.

నవ్యత్వంలో చైతన్యం అని డిగ్రి చెప్పింది. అయినా...

"పిల్లలుపుట్టే ఆశ వుందా ?" అంది సుందరి.

"కలగక పోవచ్చు..."

"అంటే కలగవచ్చా...కలగరా ?"

ఆ విషయం ఆగిపోయింది.

మర్నాడే నిత్యానందం బెంగుళూరు వెళ్ళిపోయేడు.

"చైత్రబహుళ దశమి. రాత్రి పది గంటలకు పుత్రోదయం అయ్యింది. తల్లీ పిల్లాడు కులాసాగా వున్నారు." పచ్చ తోరణంతోనే నిత్యానందం ఉత్తరం వచ్చింది తర్వాత...

* * * *

నర్సు బైటికి వచ్చి, "ఆపరేషన్‌కు తయారుచేసేం. క్లోరోఫారం ఇస్తున్నాం..." తక్కినది సంశయంలోనే చూచింది. అందులో ఇంకా నీ అభిప్రాయం మార్చుకోడాన్కి కాలంవుంది అన్న భావం వుంది.

కెప్టెన్ రంగా ! ! ఈ ఆఖరి సమయంలోకూడా నాకు అనుమానం, పిరికితనం కల్గటంలేదు.

రంగా ! !

పసిడి బొమ్మ జీవితం ఎక్కువకాలం పెంచుకోలేక పోవడంవల్లే రంగాతో నిత్యానందం మళ్ళీ ఈవూరుకు వచ్చేడు.

ఈ వచ్చినప్పటినుండే నా మానసిక శాంతి చెదరింది. నిత్యానందం అనుమానిస్తున్నాడా? అన్న భావన చిలవలూ పలవలూ, ఈ నా నిశ్శబ్దసమయాల్లో అల్లుకుంది. పసిడిబొమ్మ పొందిన శాంతి నాకు లేనట్లే అయ్యింది. రాత్రిళ్లు కలలు కలలు వచ్చేవి. మిత్తిల్లా, బ్రహ్మరాక్షసుల్లా, విచిత్రంగా పలవ రించేవాణ్ణిట. సుందరి ఖంగారుగా లేచి, అనునయం చేసేది.

ఆ రోజునుండి రంగా నా అజమాయిషీ క్రిందనే పెరిగేడు. నా శాస్త్రంయొక్క విజయచిహ్నం అని కణంకణం ఎగిరిపడే అవ్యాజ అనురాగంలో నేను సుందరికి అనుమానం కల్గచేస్తానేమో అన్న భయం పీకేది. రంగా పెరిగినకొలదీ, నా రూపంలోని పాలు, ముప్పాతిక పొందడంతో, నేను తప్పిదం చేసేనా అన్నదే విషయం అయ్యింది.

ఆరోజుల్లోనే రోజూ 'మామాయ్' అని పిల్చేవాడు. తన తండ్రి ఎన్నిసార్లు నిత్యం శిక్షించేవాడో చెప్పేవాడు. అవి వింటుంటే లేతహృదయాలమీద అనుమానం అనేది పెను భూతంగా మారి సంచరించే వ్యక్తులు, ఎంత దౌర్భాగ్యంగా ప్రవర్తిస్తారో తెలిసింది. ఈ తండ్రి అమావాస్య పౌర్ణమిలే నేర్చుకుని, రంగా పెరిగి పెద్దవాడుగా అవడం నాకు ఇష్టం వుండేది కాదు. హృదయంలో బరువుతోటే రోజులు కదిలేయి.

శోభ పూర్తిగా తల్లి పోలికల్తోనే రావడం, రోజూ రంగా, శోభలు ఆడుకోవడం చూస్తే ఆనందం కల్గేది.

వాళ్ళిద్దరూ పెద్దవాళ్ళే అయ్యేరు.

ఓరోజు కాబోలు...

నిత్యానందం రోజుకుంటూనే "వాడు పారిపోయేడు" అన్నాడు.

"ఎప్పుడు"

"నిన్న రాత్రినుండీ కన్పించుటలేదు."

"ఏం చేసేవు."

"గదినిండా ఎలుకలు, బొద్దింకలు, చేపలు చచ్చినవి దాచేడని కొట్టాను."

శోభ పడ్చింది. ఆరోజు అన్నం తిననేలేదు! "రంగా డాక్టరీ చదివి నీఅంతవాడవ్వాలనే అనుకుంటున్నాడు."

ఐనా లైబ్రరీలోని పుస్తకాలు సగంపైగా కన్పించనే లేదు. అర్థం అయ్యింది. అప్పుడప్పుడు అడిగే. "పిల్లికి ముందరి కాళ్ళు చేతుల్లా ఉపయోగపడతాయా ? పక్షులకు రెక్కలమీద చేతులున్నాయా ? మడతబందుకీలు, బంతిగిన్నెకీలు అంటే ఏమిటి ?" ఈ ప్రశ్నలభావం ఇప్పుడు గోచరం అయ్యింది.

"ఈరోజు కుందేలునుకోసి బల్లమీద పెట్టేడు. ఎన్నాళ్ళు ఊరుకోను. జీవహింసే అలవాటు పడితే రేపు ఏమార్గాల్లో పడుతాడో ఊహించేవా ?" నిత్యానందం అరిచేడు.

"నాకు తెలుసు కడుపులో ఏమీ పడకపోతే సాయింత్రంకు వస్తాడనే" వెళ్ళేడు. దుఃఖం వచ్చింది!

సుందరి అడిగింది.

"రంగా పారిపోయేట్ట"

"అయినా మీకెందుకూ. ఏదో రక్తస్పర్శ ఉన్నట్లు మాట్లాడుతారు"

"వాడు...వెళ్ళిపోయేడు"

"మీకు...ఆ"

"లేదు. తప్పుగా అర్థం చేసుకుంటున్నావ్..." ఆ సమయంలో చెప్పే. శాంతికోసమే చెప్పే. తప్పిదం అనుకున్న భావంలోనే జరిగిందంతా చెప్పే.

"నేను అనుకున్నా ఏదో జరిగి వుంటుందని.... చెప్పి ఆనాడేవుంటే నువ్వు బాధపడకుండా వుండేవాడివికా." కోటు అందించింది. కర్ర ఇస్తూనే "వెళ్ళిరా, వాడిని తీసుకురండి."

సుందర్ని అర్థం చేసుకోనగలనా అన్న ఆశ్చర్యం కల్గింది. ఆరాత్రి అంతా వెదికేను.

ఇప్పుడో.

బాహ్యా ప్రకృతితో సంబంధం లేకుండానే, ఆరంగా కత్తులు క్రిందనే వుండిపోయింది.

ఐదేళ్ళ తర్వాత డాక్టరీ అయి రంగా మిలిటరీలో చేరిపోయేడు.

శోభకి ఉత్తరాలు వ్రాసేవాడు. అందులో ఉన్మత్తత ఉండేది. రామూ ఇంజనీరింగ్‌లోకి వెళ్ళేడు. గోపీ ఆనర్సు, ఆనంద్ బి. ఏ చదువుతున్నాడు. శోభ మెట్రిక్ అయి కూర్చుంది.

ఆ శెలవుల్లో రంగా వచ్చేడు. వెనకనుండిచూస్తే నేనేమో అనిపించింది. ఏవోఏవో చెప్పేడు. శోభకి తీరుబడే లేకపోయింది.

ఇంక వెళ్ళి, హాస్పటల్‌లో అసిస్టెంటుగా జేరుతాడన్న రోజునే..."మామాయి...శోభని పెళ్ళి చేసుకోవాలను కుం టున్నా" అడిగేడు.

శోభని రంగా వచ్చినప్పటినుండీ చూస్తూనేవున్నా. మార్పు, నవోఢత్వం, అన్నీ మూర్తీభవిస్తున్నాయి. అనుమానం కల్గింది.

అవి చూచే సుందరి అంది "మనం ఏదో చెయ్యాలి... అది జరగకూడదు..."

హృదయం కెక్కిళించింది. శాస్త్రం, దాని అనుచరణ, మానవత్వం, అన్నిటికంటె ఆత్మ ఈనాడు నిలచిపోయేయి. 'ఏంచెయ్యనూ' అన్న నిరాశకల్గింది.

దూరంగానే తీసుకువెళ్ళే—

'ఎల్లా చెప్పనూ అన్న ఆవేదనతో' నడిచేను.

"ఆనాడు ఆచెరువుగట్టు మొగలోనేకాదు నువ్వు న్నన్ను పట్టుకున్నది...అక్కడికేం నేనూ, శోభ ఇన్నిరోజుల నుండీ వచ్చేం...శోభ అనేది. ఇక్కడనే వుండిపోదాం అని..."

చెప్పాలి. కణాలు తోస్తున్నయ్. త్వరగానే చెప్పాలి. అయినా మౌఢ్యంలో ఒట్టి మూర్ఖుడిగానే ఊకొట్టేను.

ఏవో—ఏవో చెప్పుతూనే వున్నాడు.

'శోభ ఇంకా చదువుతుందట మామాయి? బి. ఏ వరకూ చదివి...పంతులమ్మ...'

"భగవాన్ ఏందారి"

ఇంటికి వచ్చే...

మేడమెట్లు దిగుతూనే...నా కళ్ళల్లోని నిరాశ చూచి సుందరి. "రంగా...శోభని నా మేనల్లుడి కివ్వడాన్కి నిశ్చయం చేసేను... మీ ఇద్దరి దాంపత్యం నేను, ఆయనా ఒప్పుకో లేదు...ఒప్పుకోలేం...దానికి కారణం..."

మాట్లాడుతూనే కాలుజారింది. ఇరవై ఆరు మెట్లు...

రక్తం మడుగు...

"సుందరీ!"

ఏం చెప్పనూ...అందరూ వచ్చేరు. బ్రెయిన్ కంకషన్ —అన్నారు. ఒకళ్ళూ ధైర్యం చెయ్యలేకపోయేరు.

రంగా కళ్ళల్లోకి చూచేడు. బాధ, ఆవేదన నిరాశ కన్పించేయి.

చూస్తూనే వున్నాడు. వాళ్ళ రాకపోకలు...

ఆఖర్నే...

"మామాయి. ఆపరేషణ చేస్తాను. కాని ముందుగా దీవించు". రంగా కాళ్ళని అద్దుకున్నాడు.

నిజంగా ఆ సమయంలో నా కొడుకే అడిగివుంటే, వానిలో నమ్మకం ఉంచలేక పోయివుండే వాడినేమో అనుకున్నా.

ఏ మవుతుంది?

రంగా...బయటకు వచ్చేడు...

ఘంట తర్వాతనే...

"మామాయి!"

తక్కింది చెప్పలేక పోయేడు...

దగ్గరగా కౌగలించుకున్నా...

"ఎందుకు చెప్పలేదు నువ్వు మొట్ట మొదటే..." సహజంగానే కోటు బొత్తముల్లో తలదూర్చి అన్నాడు.

ఈనాడు...ఇప్పుడు...సుందరి ప్రక్కకూర్చుంది.

శోభ చదువుతోంది.

రంగా దూరంగానే ఉండిపోయేడు. కాని ప్రతీ పండక్కీ వస్తూనే వున్నాడు.

కాని...

నేను వ్యభిచారం చేసేనా ?

శాస్త్రాన్ని పెడత్రోవల్లో త్రొక్కేనా ?

రంగాకి అన్యాయం చేసేనా ?

శోభ జీవనం త్రెగకొట్టేనా ?

ఇవే ఎదురు తిరుగుతాయి.

సమాధానం పొందలేక కూర్చుంటూ...ఈ కిటికీలోంచి చూస్తా. బయట పువ్వులు నవ్వుతాయి పసిడిబొమ్మ మొఖంలో

ఎవరైనా చెపుతారా ?

ఆలోచన.

ఆశ...



## తురగా కృష్ణమోహనరావు

వీరి వయస్సు 28 సంవత్సరాలు. ఎం. ఏ. ఎల్. ఎల్. బి లలో ఉత్తీర్ణులు.

వీరు వ్రాసిన "అద్దంముందు", "లావెక్కడం లోనేఉంది తమాషా" అనే రచనలు పాఠక లోకాన్ని బాగా ఆకర్షించాయి. వీరు రేడియో నాటి కలుకూడ వ్రాస్తూంటారు. వీరి రచనలు వివిధ పత్రి కల్లో కనిపిస్తూంటాయి.

కాలేజీ చదువు రోజుల్లో ఇంగ్లీషులోను తెలుగులోను, వ్యాసరచన వక్తృత్వపు పోటీలలో బహుమతులు పొందారు.

వీరి వ్యాసంగాలు నాటకాలలో వేషాలు వెయ్యడం, బహిరంగ సభలలో మాట్లాడడం, మధురమైన పాటవింటే నృత్యం చెయ్యడం, అడి గినవారికి అడగనివారికి సలహాలివ్వడం.

హాస్యధోరణిలో రచనలు సాగించడమంటే వీరికి ఎక్కువ కుతూహలం.

హాస్యంద్వారా ఇతివృత్తంలో క్రొత్తదనం, భావుకత ప్రదర్శిస్తూ వీరి రచనలు ఆకర్షణీయకంగా ఉంటాయి.

★

" .............. "

ఆవేళ ఉదయం జగన్నాధం పరిస్థితి అంతా అయోమయంగా ఉంది. శరీరమంతా తేలిగ్గాఉండి, రెక్క లక్కర లేకుండానే గాలిలో ఎగిరిపోగల ననిపించేటట్టుగా ఉంది. ఒకసారి చేతులాడించి చూద్దామా అనుకున్నాడు. శరీరమల్లా తేలిగ్గా ఉండడమో కాకుండా బరువుగాకూడా ఉంది. నెత్తిమీద ఎవరో సీసాపెట్టి కొట్టినట్టుగా ఉంది. అతనికిదంతా ఏమీ అర్థం కావడంలేదు.

దీనికి తోడు ఇంట్లోవాళ్ళుకూడా చాలా విపరీతంగా ప్రవర్తిస్తున్నారు. తను డ్రాయింగురూములో కూచొనిఉన్నాడు. కూచొని 'కేపిటల్' పత్రికలో నిన్న తను పెన్సిలుతో గుర్తుచేసిన భాగం తిరిగి చదువుతున్నాడు. ప్రభాకరం గదిలోకి వచ్చాడు. తనముందే నిలబడ్డాడు. తనని చూడలేదు: పలకరించలేదు. పైగా పలకరించినా, మాట్లాడలేదు. జగన్నాథం వాడి భుజం మీద చెయ్యివేసి తనవైపుకు తిప్పుకుందామని ప్రయత్నం చేశాడు. వాడు ఏమీ మాట్లాడలేదు. పైగా - వచ్చి తను కూచున్న కుర్చీలోనే కూచోపోయాడు. జగన్నాథానికి చాలా ఆశ్చర్యం వేసింది. కోపంకూడా వచ్చింది.

ప్రభాకరం తన దగ్గర్నించి లేచివెళ్ళి - కిటికీకి ఎదురుగా నిలబడ్డాడు. ఆ కిటికీ దగ్గర నిలబడితే ఎదురుగా మేడమీద వెలమ వాళ్ళ అమ్మాయి కనపడుతుంది. ఆడవాళ్ళ విషయంలో ప్రభా

కసం పశువులా ప్రవర్తిస్తాడని పెద్దబ్బాయి మూర్తి తనకు ఎప్పుడో చెప్పాడు. కాని తన ఎదురుగుండానే ప్రభాకరం ఇట్లు ప్రవర్తించడం ఇది మొదటిసారి.

అసలు జగన్నాథానికి వారం రోజులనుంచీ ఇంట్లోవాళ్ళ ప్రవర్తనలో మార్పు కనపడింది. ముప్పై సంవత్సరాల సర్వీసు చేసి పింఛను తీసుకొన్నాడు వారం రోజులక్రితం. బ్యాంకు నుంచి ఎవరు పింఛను తీసుకున్నా - పెద్ద పార్టీచేయడం అల వాటు. క్రిందటినెల జయరాంసింగు పింఛను తీసుకుంటే పెద్ద పార్టీజరిగింది. అందరూ ఉపన్యాసాలు ఇచ్చారు. తను ఆఫీసు వదలి వెళ్ళిపోతూన్నప్పుడు ఎవరూ పార్టీసంగతే ఎత్తలేదు. మేనేజింగు డైరెక్టరు మాత్రం 'సారీ దట్ యుఆర్ గోయింగు' అన్నాడు - నాలుక చివర్నించి. వస్తోన్న ఆఫీసరు సంగతేకాని వెళ్ళిపోతూన్న ఆఫీసరు సంగతి ఎవరకీ అక్కర్లేదు.

'ప్రభాకరం!' అని గద్దించిపిలిచాడు జగన్నాథం. సాధా రణంగా తన కంఠం వినగానే పరుగెత్తుకొచ్చేవాడు ప్రభాకరం. అసలు వెనక్కి తిరగలేదు. 'వినపడలేదేమో!' అనుకున్నాడు జగన్నాథం. అయ్యుండచ్చు. తన కంఠం తనకే వినపడలేదు. అసలు అంతా అయోమయంగా ఉంది. ఏదీ సహజంగా కన పడ్డంలేదు. గోడలు, గుమ్మాలు, బల్లలు, కుర్చీలు అన్నీ మంచు తెరల్లా కరిగి పోతున్నాయి. కుర్చీలో కూచున్న తనలోంచి కుర్చీ కనపడుతోంది, కుర్చీలోంచి నేల కనపడుతోంది. నేలలోంచి ఏవేవో మంచుతెరలు కనిపిస్తున్నాయి.

ఈ లోపుగా ఆ కిష్టిగాడు వచ్చాడు. ఇంత పొద్దున్నే వాడు ఆ ఇంట్లో ఏం చేస్తున్నాడో తెలియదు. పాతికేళ్ళు ఉన్నాయో లేదో వాడి దురహంకారానికి అంతులేదు. 'జగన్నాథం మామయ్యా పని ఐపోయింది. నేను పైకొస్తున్నవాణ్ణి. నన్నుచూచి మామయ్యా భయపడాలిగాని మామయ్యాను చూసి నేను భయపడను' అన్నాట్ట ఒకసారి వాడు. వీడి పొగరుమోత్తనానికి అంతం లేకుండా ఉంది. ఒకసారి జగన్నాథం పెద్దమేనల్లుణ్ని పిలిచి చెప్పాడు నీ తమ్ముణ్ని కాస్త అదుపులో పెట్టమని. వీడు వింటేగా ? ఒకసారి జగన్నాథం ఎందుకో కేకలేశాడు వాణ్ణి. దాంతో కృష్ణారావు 'మామయ్యా తనుచేసింది తప్పు అని ఒప్పుకొనేవరకూ ఈ ఇంటికి రానేరాను' అన్నాడు. అన్నమాట నిలపెట్టుకున్నాడుకూడా. మరి ఈవాళ ఎందుకువచ్చాడో? వీడు.

హాల్లోంచి వరండాలోకి వచ్చిన కృష్ణారావును చూడగానే జగన్నాథానికి తటాలున గుర్తుకొచ్చింది తన ప్రయాణం సంగతి. నిన్నరాత్రి తను ప్రయాణమై బయలుదేరి వెళ్ళాడు. టిక్కెట్టు కొనుక్కోడం, ఫస్టు క్లాసులో కూచోడం, రైలు కదలడంకూడా జ్ఞాపకముంది. 'అదంతా కలేమో' అనుకున్నాడు జగన్నాథం. మరుక్షణంలో 'ఇదే కలేమో ?' అనిపించింది అతనికి. ఒళ్ళు గిల్లి చూసుకున్నాడు. జగన్నాథానికి నవ్వు వచ్చింది. నిజంగా కలేకనక అయితే గిల్లుకుంటేమాత్రం తెలుస్తుందా ఏమిటి ?

'ఒరేయి కృష్ణా ! ఇలా రా !'- ఆ కృష్ణారావును పిలిచాడు జగన్నాథం. వాడు మాట్లాడ లేదు. తన్ని కాదన్న

ట్టుగా వినిపించుకోకుండా ఊరుకున్నాడు. కిటికీదగ్గర నిలబడ్డ ప్రభాకరం మాత్రం వాణ్ణి చూసి సిగ్గుపడుతూ ఇవతలకి వచ్చి వంటింట్లోకి వెళ్ళిపోయాడు. ఏవిటో ఏదో కొంపమునిగిపోయి నట్లు వాడు వంటింట్లో పడి పడుస్తూంటాడు ఎప్పుడూ.

ఈ కిష్టిగాడొకడు. రాత్రి స్టేషను దగ్గరకూడా కనపడ్డాడు. 'ఏరా ? స్టేషనుకొచ్చావ్ ?' అని అడిగాడు. 'మా ఫ్రెండు బందరు వెడుతున్నాడు. సెండాఫు ఇద్దామనివచ్చాను' అన్నాడు. అని అక్కడనుంచి వెళ్ళిపోయాడు. పోనీ - మాటవరసకయినా 'నువ్వు ఊరెడుతున్నావు గదా ? అని చూసి పోదామని వచ్చాను మామయ్యా ?' అనకూడదు ? ఊహు ! ఆమాత్రం తెలివితేటలుంటే ఇంకేం కావాలి ?

ట్రెయిను వచ్చింది. జగన్నాథం ఫస్టుక్లాసు కంపార్టు మెంటులో కూచున్నాడు. ఎదురు బెర్తులో బందరాయిన కూచు న్నాడు. ఎవరో మిల్లు యజమానిట. వ్యవహారంకోసం నిజామా బాదు వెళ్ళి వస్తున్నాడు. ఆపక్క బెర్తులో ఒకావిడ మదరాసు పోతూంది పిల్లలను తీసుకొని.

జగన్నాథం మిల్లుయజమానితో బాతాఖానీకి దిగాడు. రైలు రెండుమూడు స్టేషనులు దాటిందో లేదో మధ్యన ఆగి పోయింది. జగన్నాథం చటుక్కున లేచి కిటికీలోనుంచి తొంగి చూశాడు అంతా చీకటిగా ఉంది. ఏమీ కనపడలేదు. జగన్నాథం వాళ్ళు కూచున్న పెట్టె సరిగ్గా ఒక వంతెనమీద ఆగింది. అందు చేత దిగి, వెళ్ళి చూడడానికి వీల్లేదు. ఆదారిన గార్డు వస్తూంటే

ఏం జరిగిందని అడిగి తెలుసుకున్నాడు జగన్నాథం. పన్నెండేళ్ళ అమ్మాయి రైలుకింద పడి చనిపోయిందని తెలిసింది. ఐదు నిమిషాలు ఆగిన తర్వాత రైలు కదిలి వెళ్ళిపోయింది. ఈ లోగానే ఆ అమ్మాయి చావుని గురించి అనేక వార్తలు వచ్చాయి; అనేక చర్చలు చెలరేగాయి. ఆ అమ్మాయి చనిపోయిన తావు మీదనుంచి తన పెట్టె పోతూంటే - కిటికీలోంచి చీకట్లోకి తొంగిచూశాడు జగన్నాథం. ఏమీ కనపడ లేదు - అమ్మాయి శవంకాని, రక్తంకాని - ఏమీ కనపడలేదు, అన్నీ చీకట్లో కలిసిపోయాయి. మూలుగుతూ, నీలుగుతూ రైలు ముందుకు పోయింది.

ఈ సంఘటన జరిగిన తర్వాత కంపార్టుమెంటులో ఎవరూ మాట్లాడ లేదు - ఏదో ఒకటి రెండుసార్లు తప్ప. అది అందరి మనస్సులను కలచివేసింది. ముఖ్యంగా జగన్నాథాన్ని ఏదో ఆవేదన ఆవరించింది. ఈ జీవితం అనిత్యం. అంతం ఏక్షణంలో ఏరూపంలో వస్తుందో తెలియదు. ఆ అమ్మాయి ఆత్మహత్య చేసుకుందా? అయ్యుండదు. ఆ వయస్సు ఆత్మహత్యవరకూ పరిస్థితులను తీసుకొని పొయ్యే వయస్సు కాదు. ఆత్మహత్య చేసుకోవాలని కోరిక కలిగే సమస్యలేమీ పన్నెండేళ్ళ పిల్లకు కలగవు. మరి-ప్రమాదమే అయ్యుండాలి....ప్రమాదం మాత్రం ఎల్లా అవుతుంది? ఎంత వర్షం కురిస్తేమాత్రం - రైలు మీద మీదకు వస్తూంటే లైట్లు కనపడవా ఆ పిల్లకి? దూరం నుంచీ ఆ పిల్ల కనుపిస్తూంటే రైలు ఆపలేకపోయాడా డ్రైవరు? లేదు. ఇది ఆత్మహత్యా కాదు; సాధారణ ప్రమాదమూ కాదు.

ఎవరో చంపి తీసుకొచ్చి రైలు వచ్చే సమయానికి పట్టాలమీద పడేసుంటారు.

ఎంత ప్రయత్నించినా జగన్నాథానికి నిద్రపట్టలేదు. కంపార్టుమెంటులో మిగిలినవాళ్ళందరూ కళ్ళు మూసుకున్నారు. పై బెర్తుమీద పడుకొన్న జగన్నాథం తిరుగుతూన్న ఫేనువైపుచూస్తూ ఆలోచించడం ప్రారంభించాడు. ఏభై సంవత్సరాలకు పైబడ్డ జీవితంలో జగన్నాథం చెయ్యని పాపమంటూ లేదు. చిన్నతనంలోనే వాళ్ళకాళ్ళూ వీళ్ళకాళ్లూ పట్టుకొని ఉద్యోగంలో చేరాడు. ఉద్యోగం దొరికేవరకూ ఆతనుపడ్డ బాధలు ఆ భగవంతుడికె తెలుక. ఉద్యోగములో చేరిన మరుక్షణమునుంచి పైకిపోవడము ఎల్లా అనే తహ తహ అతన్ని పీడించుకుతినడం మొదలైంది. పిల్లలుపుట్టి పెద్దవాళ్ళవుతుంటే వాళ్ళకు దారిచూపించాల్సినబాధ్యత జగన్నాథం పైన పడింది. ముప్పైఏళ్ళ సర్వీసులో బ్యాంకులో గుమాస్తాగాచేరిన జగన్నాథము బ్యాంకుకి సెక్రటరీ పదవికి చేరుకున్నాడు. నెలకు ఇరవై రూపాయలనుంచి ఎలవెన్సులతోసహా పదివందల ఇరవైనాలుగు రూపాయలు సంపాదించే యోగ్యత వచ్చింది. అధికారంలో, వేతనంలో ఫోదాలో సంపాదించిన ఈ పెరుగుదలకోసం జగన్నాథం చెయ్యనిపాపంలేదు. అతని క్రింద ఉద్యోగులందరూ అతన్ని అసహ్యించుకొనేవారు.

"నేను చాలా పాపాలు చేశాను. ఎంతమందినో నాశనం చేశాను. వాళ్ళెవరికీ ఇంతవరకూ నన్ను చంపెయ్యాలని బుద్ధి పుట్టకపోవడం ఆశ్చర్యమే!" అనుకున్నాడు జగన్నాథం గిర్రున

తిరుగుతున్న ఫేనువైపు చూస్తూ. కాని ఈమాట ఎవరికీ విన పడకుండా, తెలియకుండా—తనలోతను అనుకోడం కూడా నచ్చలేదు జగన్నాథానికి. "ఇదంతా ఆ నలుగురి పిల్లలకోసం చేశాను. పెళ్ళాం బిడ్డలకోసం ఎంతైనా చెయ్యవలసి వస్తుంది" అని మనసును సరిపెట్టుకొన్నాడు జగన్నాథం.

ఆలేరులోనో జనగామలోనో రైలు ఆగింది. అంతకు ముందే రైలు పడిపోయిందేమో అన్నంత చప్పుడు అయింది వెనుకనుంచి. ఎదురుగా పడుకొన్న మిల్లుయజమాని కళ్ళు తెరచి చూశాడు. "ఏం జరిగింది ?" అన్నాడు. "రైలు పడి పోయిందేమో ?" అన్నాడు వేళాకోళంగా జగన్నాథం.

"అల్లా అనకండి పంతులుగారు! ఒక పక్కన వర్షం ముంచుకొస్తుంటే" అన్నాడు ఎదురాయన. అని ఒళ్ళంతా ముసుగుపెట్టుకున్నాడు. జగన్నాథం నవ్వేడు. నవ్వేడుకాని అతని ఒళ్ళంతా జలదరించింది. డ్రైవరు ఈ చీకట్లో ఒకచిన్న పొరపాటుచేస్తే ఇన్నివందల ప్రాణాలు ఎగిరిపోవాల్సిందేకదా అనుకున్నాడు. ప్రాణాలు పోయినా ఫరవాలేదు. దెబ్బలుతగిలి కాలో చెయ్యో విరిగి బ్రతికుండవలసివస్తే ?

రైలాగగానే కాఫీ దొరుకుతుందేమో తలుపు తెరచి చూశాడు జగన్నాథం. కాఫీమాట దేముడెరుగును కాని బట్ట లన్నీ తడిసిపోయాయి. విపరీతమైన జల్లు. చేసేదిలేక వచ్చి తన బెర్తు ఎక్కి ముసు గెట్టి పడుకున్నాడు. అదోరకం కలతనిద్ర పట్టింది. ఈ కలతనిద్రలో పదిహేను నిముషాలు గడిచుండొచ్చు. హఠాత్తుగా మెలకువ వచ్చింది అతనికి. అతను పై బెర్తుమీద

నుంచి ఎగిరి కిందపడ్డాడు. తలకాయకు పెద్ద దెబ్బతగిలింది. తలుపుకు చిల్లుపడి కాబోలు లోపలికి బాగా నీళ్ళు వచ్చేస్తు న్నాయి. పెట్టెలోఉన్న మదరాసీ ఆవిడ పెద్దపెద్ద కేకలు పెడు తోంది భయంతో. ఎక్కడ చూసినా ఏడుపులూ పెడబొబ్బలూ వినబడుతున్నాయి. అంతా ఒక్కసారి నిశ్శబ్దమై పోయింది. జగన్నాథానికి స్పృహతప్పి పోయింది.

జగన్నాథం కళ్ళు తెరిచేసరికి తన ఇంట్లో డ్రాయింగు రూములో ఉన్నాడు. పరిస్థితంతా అయోమయంగా ఉంది. ఏమీ అర్థం కావటంలేదు. ఎదురుగా కిష్టిగాడు కనుపించేసరికి తన ప్రయాణం సంగతి గుర్తుకొచ్చింది. నిన్నరాత్రి జనగామ వరకూ ప్రయాణం చేసిన తను తనకు తెలియకుండానే పొద్దు న్నకు తన ఇంటికి ఎలా చేరుకున్నాడు ? హఠాత్తుగా జగ న్నాథానికి అనుమానం వేసింది. అక్కడ తగిలిన దెబ్బకు చచ్చి పోలేదు కదా కొంపతీసి ? అని గుండెలు ఝల్లుమన్నాయి. కాని వెంటనే సంతోషంకూడా వేసింది. భగవంతుడు తగిలించిన బంధాలన్నీ తెంచుకున్నట్లుగా భావించుకోటం ప్రారంభించాడు. ఈ గోడలు, ఈతలుపులు ఇవన్నీ ఏవీ అడ్డురావు తనకి. తను తలచుకుంటే ఎక్కడికైనా పోవచ్చు. ఏమయినా చూడొచ్చు. ఎవరూ అడ్డురారు; అడ్డురాలేరు.

జగన్నాథానికి ఇప్పుడంతా అర్థమైంది. ఒక్కసారి చేతులు చాసి అటూ ఇటూ ఆడించేసరికి గాలిలోకి లేచిపోయాడు. ఒక్క నిమిషంలో ఊరంతా కింద పచార్లుచేస్తూంది. తను పని చేసిన బ్యాంకు దగ్గరకు వెళ్ళాడు. తనతో పనిచేసిన వాళ్ళందరి

బల్లల దగ్గరకు వెళ్ళి కూచున్నాడు. ఎవరూ తనని గమనించలేదు. జగన్నాథం అనేవ్యక్తి అసలు ఎప్పుడూ బ్యాంకులో పనిచెయ్యనే లేదు అన్నట్టుగా సాగిపోతూంది బ్యాంకులోపని. ఇది జగన్నాథానికి కొద్దిగా బాధగానే ఉంది. అతనికి లోలోపల ఏదో అసంతృప్తి కలిగింది. ఎగిరి - తిన్నగా తనఇల్లు చేరుకున్నాడు.

ఊరంతా కోలాహలంగా ఉంది. రైలుప్రమాదపు వార్తలను జనం గుంపులు గుంపులుగా చేరి చర్చించుకొంటున్నారు. ఇంటి దగ్గర వాతావరణం అంతా మారిపోయింది. ప్రభాకరం కిటికీదగ్గర నిలబడి ఎదురి మేడమీది వెలమవాళ్ళ అమ్మాయివంక చూడటంలేదు. వంటింటి గోడ నానుకొని ఏడుస్తున్నాడు. పక్కన నిలబడి మదరాసీ వంటావిడ 'ఏడవకు, నాయినా? ఎందుకేడుస్తావ్ ? మీనాయన మన్చిగానే ఉండుంటాడు' అని ఓదారుస్తూంటే వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. ఆకిష్టిగాడు మాత్రం జేబులో చేతులెట్టుకొని వీధులోంచి ఇంట్లోకి, ఇంట్లోంచి వీధులోకి గొప్పగా తిరుగుతున్నాడు - కనుపించిన వాళ్ళందరినీ ఓదారుస్తూ. 'నాకింకెవరు దిక్కూ ?' అని ఏడుస్తోంది పెళ్ళాం - సందులో కూచొని. జగన్నాథం ఒళ్ళు విరుచుకున్నాడు గర్వంగా. 'తను చచ్చిపోయాడేమో అనుకునే ఇంత ఏడుస్తున్నారే! నిజంగా చచ్చిపోయినట్టు తెలిస్తే ఇంకా ఎంత ఏడుస్తారో ?' అనుకున్నాడు అలవాటు చొప్పున అద్దంముందు నిలబడి. వెళ్ళి డ్రాయింగు రూములో ఒళ్ళు వాల్చుకున్నాడు. కునుకు పట్టింది.

ఆదేమిటో ఊమధ్య జగన్నాథానికి ఎప్పుడు నిద్రపట్టినా ఏదో ప్రమాదం వస్తూవేఉంది. నిన్నరాత్రి కలతనిద్ర పోయాడు.

రైలు పడిపోయింది మరోసారి నిద్రపోతే ప్రాణమే పోయింది. వీధివైపు అరుగు మీదనుంచి ఒక కూజాగ్లాసు వచ్చి డ్రాయింగు రూమ్‌లో జగన్నాథం కాళ్ళదగ్గర పడ్డాయి. అతనికి మెలకువ వచ్చింది. ప్రభాకరం, రెండో అబ్బాయి పరమేశ్వరం ఇద్దరూ దెబ్బలాడు కొంటున్నారు. తనకు ఇంకా చదువు పూర్తికాలేదు కాబట్టి ఇన్సూరెన్సు డబ్బు తనకు రావాలంటాడు ప్రభాకరం. 'నీకు పెళ్ళాంబిడ్డ లున్నారు కాబట్టి నాన్నకు అప్పులు మిగి లాయి. అప్పులో నేను భాగం పంచుకోను' అంటాడు వాడు. పెద్దబ్బాయి మూర్తి జనగామ వెళ్ళాడట - జగన్నాథం చచ్చి పోయాడో లేదో చూడటానికి. 'మేము కష్టపడి డబ్బు సంపా దించిస్తే - నువ్వు కూచొని తింటున్నావు ఇంతకాలం! అన్న య్యను రానీ, చెబుతాను' అన్నాడు పరమేశ్వరం. కిటికీదగ్గర గోడ నానుకొని కళ్ళనీళ్ళు పెట్టుకొని చూస్తున్నాడు ఇదంతా మూడోవాడు. జగన్నాథానికీ ఒక్కొక్కళ్ళనే మొత్త బుద్ధే సింది. పెళ్ళాం ఏం చేస్తూందో చూద్దామని సందులోకి వెళ్ళాడు. మాణిక్యాలు అక్కడలేదు. పడకగదిలో అద్దంముందు అన్ని నగలు పెట్టుకొని అలంకరించుకు నిలబడి ఉంది. జగనాథం ఇక కోపం పట్టలేక 'ఏమిటీవేషం?'అని అరిచాడు తన కంఠం తన కేగాదు ఎవరకీ వినపడదన్న సంగతి మరచిపోయి. "నిన్న రాత్రి నాకు కల్లో కనపడ్డారు. 'పిచ్చిదానా! ఏడవకు. నగలన్నీ పెట్టుకో. నువ్వన్నీ పెట్టుకుంటేనే నాకు ఆనందం' అన్నారు. అప్పుడు నాకు అర్థంకాలేదు. పాపిష్ఠిదాన్ని. ఇప్పుడంతా అర్థ మయింది" అంది మాణిక్యాలు ఏడుస్తూ. పక్కన నిలబడ్డ

రాజమ్మగారు 'కాదుటమ్మా?' అంది - ఎవరికీ ఏం ఇబ్బంది లేకుండా.

హఠాత్తుగా జగన్నాథాన్ని ఎవరో తాడుపట్టి లాగి నట్టుగా అయింది. గాలిలోకి ఎగిరిపోయాడు ఇంటి కప్పుదాటి. పట్నాలూ, పల్లెటూళ్ళు గడిచిపోయి. జనగామకి ఐదారు మైళ్ళ దూరంలో ఓ కాలువ. కాలవ ఒడ్డున ఒక ఈతచెట్టుని అనుకొని వికృతంగా వేలాడుతోంది ఒకశవం. ఆ కాలవలో ఆ చిట్టడవిలో ఎక్కడ చూచినా శవాలు. చెట్టున వికృతంగా వేలాడుతున్న శవం దగ్గరికి విసిరింది, జగన్నాథాన్ని అతన్ని లాక్కుపోయిన శక్తి.



## యం. జానకీరాణి

జననం 1936. ప్రస్తుతం హైద్రాబాదు నిజాం కళాశాలలో ఎం. ఏ. చదువుతున్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి ఇంటర్ తెలుగుపరీక్షలో ఒక సువర్ణ పతకం బహుమతి పొందారు,

వీరి కథలు "స్వతంత్ర", "ఆంధ్రప్రభ" "ఆంధ్ర పత్రిక" మొదలగు వారపత్రికలలో తరుచు ప్రచురింపబడుతున్నాయి.

మద్రాసులోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫైన్ ఆర్ట్సు ఆచార్య శ్రీ చొక్కలింగం పిళ్లైగారి వద్ద తంజావూరు భరతనాట్యం అభ్యసించారు. భరతనాట్యం, మణిపురి. నాట్యప్రదర్శనలు పలు చోట్ల యిచ్చారు.

వీరి అభిరుచులు : నాటకరంగం; స్త్రీ, బాల వికాస కార్యక్రమాలు. ప్రస్తుతం హైదరాబాదు రేడియో నాటికలలోకూడా పాల్గొంటున్నారు.

కథాగమనం నిర్మాణంలో ప్రత్యేకత గలిగి స్వచ్ఛమైన శైలిలో రసవంతంగా ఉంటాయి. వీరి రచనలు.

★

# క్షణంలో పెరిగిన గోపాలం

గోపాలానికి 15 సంవత్సరాలు వయస్సున్నప్పుడే అనసూయ నాటకాలు చూసేవాడు. అప్పట్లో చదువుకున్న, ఒక కులీనుల పిల్ల నాటకాలలో పాల్గొనడమే చాల గొప్పవిషయం. అందులోనూ అనసూయ అందమైనదే కాక, ఉత్తమనటికి కావలసిన అన్ని హంగులు కలిగివుండేది. ఆమె పలుకు, పాట, నడక—అన్నీ ప్రేక్షకలోకాన్ని తన్మయత్వమొంద చేసేవి. నాటకాలంటే చెవికోసుకొనే గోపాలానికి అనసూయ దేవతలా కనపించిందంటే ఆశ్చర్యంలేదు. ఎటొచ్చీ అనసూయకి 20 సంవత్సరాలు పైబడటమే కొంచెం ఇబ్బందిగా వుండేది, అసంఖ్యాక ప్రేక్షక సమూహంలో ఒకడైన అనామక గోపాలానికి.

అనసూయకి చాలా మంచి పేరొచ్చింది మూడు నాలుగు నాటకాలతో. ఆమె హీరోయిన్‌గావుంటే చాలు కనకవర్షం కురుస్తుందని నాటకం కంపెనీలు నమ్మేవి. ఒక్క వూరనేకాదు. దేశమంతా తిరిగింది అనసూయ. సాంఘికనాటకాల్లో ఆమె నటన అసమానం అని పత్రికలు పొగడేవి. పౌరాణిక నాటకాల్లో ఆమెగాత్రం అనుపమానమని విద్వాంసులు కూడా తలలూపేవారు. అనసూయ కీర్తిని నలువైపులా వెదజల్లుకుంటూ తన నామాతురాలతో దేశమంతా నిండిస్తుండగానే గోపాలం మెట్రిక్, ఇంటరు ప్యాసైపోయి బి. ఏ. లో చేరడం కూడా జరిగిపోయింది.

తెల్లారి హిస్టరీపేపరు పెట్టుకుని రాత్రి అనసూయ నాటకం చూసి వచ్చే ధైర్యముంది గోపాలానికి. నాటకాలు చూడ్డమేకాక నాటకాలని గురించి, నాట్యశాస్త్రాన్ని గురించి తెలుసుకోవాలనే అభిలాష గోపాలానికి బాగా చిన్నతనం లోనే కలిగింది. అతను సామాన్యప్రేక్షకునికంటే ఒక విశిష్టత సంపాదించుకున్నాడు తన విజ్ఞానంతో. స్నేహితులంతా గోపాలం ఒక్కొక్క నాటకానికిచ్చే వ్యాఖ్యానం శ్రద్ధగా వినే వారు. ఆనాటకంలో అనసూయ ఒకానొక సన్నివేశంలో ప్రక టించిన భావంలోని రసవిశేషముకూడా వివరించి చెప్పగలిగే వాడు గోపాలం. 'కలం పేరు' తో కొన్ని పత్రికల్లో కేవలం అన సూయ నటనని గురించే వ్యాసాలు వ్రాశాడతను. అనసూయ కూడా నాటకాలనిగురించి ఉత్తమ సాహిత్యం చదివిందని గోపాలం గ్రహించాడు ఆమె నటననిబట్టి.

బి. ఏ. లో చేరిన క్రొత్తలో అనసూయ నటించిన 'తిరుగుబాటు' సాంఘికనాటకం చూడడానికి వెళ్ళాడు గోపాలం. అంతకుముందు రెండుసార్లు చూసి వున్నాడు ఆ నాటకాన్ని. కానీ - చివరిరంగంలోతన భర్తనుగురించి, అతని అవినీతిని గురించి ఉపన్యాసం యిస్తుంది అనసూయ అంతులేని మానసికావేదనని వ్యక్తపరుస్తుంది. అంతా దానికదే సాటి. ఆ నటనని, ఆ పాఠోచ్చారణని చూద్దామని వెళ్ళాడు గోపాలం.

నాటకం జరుగుతోంది. మొదటిరంగంలో అనసూయ వయ్యారంగా ప్రవేశించటం, కేవలం పిపాస తొణికిసలాడే ఆమె చేష్టలు - అంతా నిర్దుష్టంగా వున్నాయి. మొదటి అంకం

పూర్తైంది. కానీ గోపాలం మనస్సు పూర్వంలాగా ఆనందం అందుకోలేదు. ఏమిటి అనసూయలో మార్పు? ఆ చూపు, ఆ పలుకు, ఆ నడక యిదివరకులాగా అతనిని తన్మయత చెందించ లేదే? కారణమేమిటి? రెండు, మూడు రంగాలు చూసేసరికి తీవ్రమైన అసంతృప్తి బయలుదేరింది గోపాలం మనస్సులో. తానే రంగస్థలంమీద నిలబడి నాటకాన్నంతా పాడు చేస్తున్నట్లుగా అనిపించింది అతనికి. అతని మనస్సంతా చీకాకు పడిపోయింది. తను మొదటిసారి ఏ భంగిమనైతే సుందరంగా భావించాడో - అది అల్లాగేవున్నా అతని మనస్సు రంజింప చేయలేదు. ఏమిటో యాంత్రికంగా వున్నది.

ఆఖరిరంగం చూడకుండానే యింటికి వెళ్ళిపోయాడు గోపాలం. 'అనసూయ నటన గొప్పగాలేదు' అని జీవితంలో మొదటిసారిగా అనుకున్నాడతను. ఆ రాత్రంతా అతనికి శాంతి లేదు.

18 సంవత్సరాలైనా నిండని గోపాలానికి ఆరాత్రి వేదన లోంచి ఒక పరమసత్యం గోచరించింది. అనసూయ నటన ఉత్తమంగా లేకపోవడానికి కారణం ఆమె నాటక కళావిజ్ఞానమే? ఆమె విజ్ఞానము, ఆమె నాట్యసిద్ధాంతాలు ఆమెకెల్లా అవరోధంగా పరిణమించాయో ఆక్షణానే తెలియవచ్చింది గోపాలానికి. ఆ తెల్లవారుఝాము ఘడియల్లోనే పరుగెత్తుకునిపోయి అనసూయకి చెప్పి, ఆమెని ఆ విపత్తులోంచి రక్షిద్దామని పించింది.

ఆ విపత్తు రానేవచ్చింది మరో సంవత్సరం గిరుక్కున తిరిగే లోగా. అనసూయ ప్రతిభ కొన్ని మెట్లు కిందికిదిగింది విమర్శ కుల దృష్టిలో. అనసూయ సంపాదించిన కీర్తి వెలిసిపోయింది. పూర్వంవలె మెచ్చుకోలులేదు అనసూయ నటనకి. గోపాలం యిదంతా గమనిస్తూనే వున్నాడు. ఆసంవత్సరకాలంలో అనసూయంటే పూర్వంవున్న అభిమానం, తానే సృష్టించుకున్న ఆ ఆత్మీయతా కరగి పోయాయి. ఇప్పుడు గోపాలానికి అనసూయ ఒక 'నటి' మాత్రమే. ఏదో వేస్తోంది నాటకాల్లో. అంతే.

ఒక సుప్రభాతాన ఒక నాటకం కంపెనీ ఆర్గనైజరు తారసపడ్డాడు గోపాలానికి. అందంగా వుండి, కమ్మగా కంఠ మెత్తి పాడే గోపాలాన్ని చూడగానే వెదుకబోయిన తీగె కాళ్ళకి తగిలినట్లైంది ఆ ఆర్గనైజరుకి. ఆయన గోపాలానికి కాఫీ యిప్పించి రిక్షా మీద యింటికి తీసుకువెళ్ళి హార్మోనియం మీద పాటలు పాడించాడు. మనస్సులో ఉక్కిరి బిక్కిరౌతున్నా గోపాలం గంభీరంగా తనకి రాబోతున్న గొప్పతనాన్ని పరిశీలించాడు. కొంచెం ఆలోచించి ఒక సాంఘిక నాటకంలో నాయిక తమ్ముడిపాత్ర వేయడానికి వప్పుకున్నాడు. ఏదో మహర్దశ అందుకున్నట్లుంది గోపాలానికి ఆరోజంతా.

నాటకం పుస్తకం తీసుకుని ఇంటికి వచ్చిన రెండుమూడు గంటల్లోనే ఆ నాటకంలో నాయికపాత్ర అనసూయ ధరిస్తోందని తెలిసింది మిత్రులద్వారా గోపాలానికి. అతని మనస్సు ఆనం దంతో పరవళ్ళు తొక్కలేదు. కానీ ఆమెతో కలిసి రిహార్సల్సు చేసేటప్పుడు చెప్పేద్దామనుకున్నాడు తను అనుకున్నమాట.

"నీనటన అంతా యాంత్రికంగా వుంది. పాత్రను అంతగా పరిశీలించకు. సహజంగా నటించు. ఇక్కడ ఇల్లా అంటే బాగుంటుంది కదా, అక్కడ అల్లాచేస్తే బాగుంటుంది కదా అని ఆలోచించకు. లోపల్నుంచి ఏం పుట్టుకువస్తే అల్లానటించు" అని 'ఎదురుగా కూర్చోపెట్టుకుని చెప్పేద్దాము, ఏమైనా అనుకోనీ' అనుకున్నాడు గోపాలం.

మొదటినాడు రిహార్సల్సు గోపాలాన్ని జీవితంలో ఒక మెట్టు ఎక్కించాయి. అనసూయపట్ల అందరూ కనపర్చేగౌరవం పెద్దనటిగా అందరూ ఆమెని చలామణిచేసే పద్ధతి - అంతా గోపాలానికి కొంత గాభరా కలిగించినమాట వాస్తవమే. పత్రికల్లో అనసూయనిగురించి ప్రత్యేకం పొగడ్తలు లేక పోవచ్చుగాక, కానీ ఆమెని ఒక ఉన్నతస్థాయిలో వుంచుతున్నారు అందరూ. ఇది గమనించాడు గోపాలం.

తనకికూడా కొద్దిగా పోర్షను వున్నా ఎవరూ తనని గురించే పట్టించుకోలేదు. పాటలుమాత్రం విడిగా ఏదో వేళప్పుడు వచ్చి ప్రాక్టీసు చెసుకోమనేవాళ్ళు. డైలాగ్సు ఎవరికీ అఖ్ఖర్లేదు. తనకి, అనసూయకి మధ్యవున్న రెండు ముక్కలుకూడా సక్రమంగా రిహార్సల్సు జరిగేదికాదు. ఒకవేళ జరిగినా ఆ డైరెక్టరో ఆ హీరోపాత్రధారో ఆమె మీదనే దృష్టినంతా కేంద్రీకరించి, గోపాలం డైలాగ్సుకూడా తామే చెప్పేసేవారు.

ఇల్లా ఒక ఆరాధ్యదైవంగావున్న అనసూయకి తను చెప్పదలచుకున్న మాటలు చెప్పడం వ్యర్థం. ఆ మాటలు చెప్పే

ధైర్యం, అవకాశం తనకీ జన్మలో సమకూడవు అనికూడా గోపాలం అనుకున్నాడు.

నాటకం జరిగింది. అనసూయ నటన యధాప్రకారం లోపభూయిష్టంగానే వుంది గోపాలానికి. ఎందుకిల్లా యంత్రం లాగా నటిస్తుంది ? యాభైసార్లు రిహార్సల్సులో పెట్టిన భంగి మలే తప్పిస్తే, వేరేవిధంగా చిటికినవ్రేలైనా కదల్చదు ఆవిడ రంగంమీద. కోపమంటే మూతీ ముడుచుకోవడం, సంతోష మంటే నోరంతా తెరచి నవ్వడం, సిగ్గు పడడమంటే తల వంచు కోవడం - ఇవన్నీ అసహ్యం కలిగించాయి గోపాలానికి. అల్లా చెయ్యాలికదా అని చేస్తుందేమిటి అని తిట్టుకున్నాడు.

అన్నిటికంటే ఆశ్చర్యకరమైన విషయ మేమిటంటే గోపాలం చాలా బాగా పాడాడనీ, అంతకంటే బాగా నటిం చాడనీ అంతా అనుకున్నారు. చాలా పేరువచ్చి, మరు రెండు నాటకాల్లో వేయమని కోరారు మరిరెండు నాటక కంపెనీల వార్లు. గోపాలంకూడా నటుడిగా గుర్తించబడ్డాడు......

సంవత్సరం తిరిగేసరికి అనసూయతో కలిసి హీరో వేషాలు వేస్తున్నాడు గోపాలం. తనకంటే కనీసం 5,6 సంవ త్సరాలు పెద్దదైన అనసూయని చూస్తే గోపాలానికి గౌరవం గానే వుండేది. ఎంత దగ్గరగావున్నా, అనసూయ ఏదో పీఠం మీద ఎక్కి కూర్చున్నట్లుగానే వుండేది గోపాలానికి. తను ఏ మాటలైతే చెబుదామని రెండుసంవత్సరాలక్రితం అనుకున్నాడో ఆమాటలు అతని నాలుకచివరి వరకు రోజు కొక్కసారైనా వచ్చేవి. కానీ ఏదో పిరికితనం! ఏమనుకుంటుందో అన్న భయం

కాదు, గ్రహిస్తుందో లేదో అన్న సంశయంకాదు. ఏదో గోడలా నిర్భేద్యంగా అడ్డువచ్చేది.

స్వతహా ఆలోచనాపరుడైన గోపాలం యోచించాడు దీన్ని గురించి. అనసూయంటే తనకి భయమా, గౌరవమా? తను చెప్పదలచుకున్న మాటల్లోని సమంజసత్వాన్ని శంకిస్తున్నాడా? ఏమీకాదు. ఏదో - ఆవిడ అంతస్థు అంతే, తన అంతస్థు యింతే.

ఒకమాటు గోపాలం ఒక ముసలివాడి వేషం వేయాల్సి వచ్చింది. అతను తప్పితే మరెవరూ అంత శక్తివంతమైన పాత్రని వేయలేరని డైరక్టరు అభిప్రాయపడ్డాడు. తనకంటే పెద్దదైన అనసూయకి తను తండ్రిగా వేయాలంటే గోపాలానికి నవ్వొచ్చింది. గోపాలం కంఠం, చూపు, నడక అంతా ప్రయత్న పూర్వంగా అద్భుతంగా మార్చేశాడు.

నాటకం రాత్రి - మొట్టమొదటిసారిగా తెల్లవిగ్గు, తెల్ల మీసాలతో తయారైనాడు గోపాలం, అనసూయకూడా నవ్వింది యీ 'పిల్లాడి'ని చూసి. ఆవిడ దృష్టిలో గోపాలం ముందునుంచీ అంతే.

మొదటి రెండురంగాల్లో దివానైనతండ్రికి కూతురంటే వాత్సల్యం, మూడో రంగంలో తనమాట కాదన్నందుకు ఆగ్రహం, నాలుగోరంగంలో ఆమె తన ప్రియునితో వెళ్ళిపోయి నందుకు మనస్తాపం - ఐదో రంగంలో ఆమె తిరిగి వచ్చిన సందర్భంలో సంతోషం, అదే సమయంలో ఆమెకి ధర్మబోధన—ఇన్ని విధాలుగా వున్నది గోపాలం నటన.

మొదటి నాలుగు రంగాలు తృప్తిగా నటించాడు గోపాలం. అడుగడుగునా అనసూయ నటననిచూసి నీరసపడి పోతూ. ప్రతిరంగం చివర లోపలికి రాగానే ఆమెనిపిల్చి చెప్పే ద్దామని కోరిక. కానీ ఆవిడ తన యెదుటికి రాగానే చిన్న పిల్లాడిని చూస్తున్నట్లుగా ఆమె తన వంక చూస్తూండగానే అత నికి ధైర్యం సడలేది. ఆమె ఉన్నతంగా, తను ఒక మెట్టుక్రిందగా గోచరించేవారు,

ఐదో రంగం జరుగుతోంది - గోపాలం దివానువేషంలో కూతురు రాకకి సంతోషించాడు. ఆమెకి ధర్మబోధన చేస్తు న్నాడు. ఇంత వాత్సల్యాపూర్ణుడు తన తండ్రి అని తెలుసుకుని కూతురు పశ్చాత్తాపపడి అతని కాళ్ళవద్ద మోకరిల్లుతుంది.

ఆ సన్నివేశంలో - అనసూయ మోకరిల్లింది. ఆమె చేతులు జోడించి వున్నది. గంభీరంగా తనకి బోధిస్తూన్న గోపాలం వేపే చూపు నిలిపిందామె. గోపాలం తనదైలాగు చెపుతున్నాడు. తల్లిదండ్రులపట్ల కర్తవ్యం జీవితంలో ఉన్నతా దర్శాలు ఏవేవో చెపుతున్నాడు. కంఠం ఉచ్ఛస్థాయికి ఎత్తి, తన చూపులోనే ఆ గురుత్వం, ఆ బోధకుని లక్షణం నిలుపుకుని వున్నాడు గోపాలం, తనవద్ద మోకరిల్లిన అనసూయని చూశాడు. ఆమె కళ్ళల్లోకి - తనవేపు దయార్ద్రంగా, గౌరవ పురస్సరంగా చూస్తూ, భక్తిప్రపత్తులతో నిండి వున్న ఆ కళ్ళ ల్లోకి ఏదో శక్తి గోపాలం నరనరాల్లో విద్యుత్తులా ప్రవహిం చింది. తను పెరిగి పెద్దయిపోతూ హిమాలయోత్తుంగ శిఖరం లాగా ఉన్నతంగా, ఆమెకి అతీతంగా భావించాడు గోపాలం.

ఆ భావన అతని చూపులో ఉద్భవించి, అతని హృదయం లోలోపలకు చొచ్చుకుపోయింది.

నాటకం పూర్తయింది. తెరజారింది. మేకప్పు తీసేసుకుని బైటకు వచ్చింది అనసూయ. ఇంకా ఆలోచనలో మునిగి వున్నాడు గోపాలం. ఆమెచూపు, తన నటన! బైటకు వెళ్ళబోయే అనసూయని చటుక్కున ఆపాడు. "చూడండి అనసూయ గారూ, మీనటన అంతా యాంత్రికంగావుంది. పాత్రను అంతగా పరిశీలించకండి. సహజంగా నటించండి. ఇక్కడ యిల్లా అంటే బాగుంటుంది కదా, అక్కడ అల్లాచూస్తే బాగుంటుంది కదా అని ఆలోచించకండి." ప్రఖ్యాతనటి అనసూయకి, ఆమె అంతస్థుని అందుకోలేని, ఆమె కంటె 5, 6 సంవత్సరాలు చిన్నవాడైన గోపాలం గడగడ చెప్పుకుపోతువుంటే—కర్రైను లాగేవాడు విన్నాడు నోరు తెరుచుకొని.

*

# ఉ ష శ్రీ

వీరి వయస్సు 24 సంవత్సరాలు. వీరి పూర్తిపేరు పురాణపండ సూర్యప్రకాశ దీక్షితులు.

ఆలమూరు వాస్తవ్యులు. రామచంద్రపురంలో శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారి ఆచార్యత్వం పొందారు. భీమవరంలోని శ్రీ నండూరి కృష్ణమాచార్యులవారి గురుత్వం లభించింది వీరికి. 1946 నుంచి రచయితలుగా పాఠక లోకానికి పరిచితులు. "విశ్వశ్రీ" అనే పత్రికకు సాహిత్యశాఖ సంపాదకత్వం వహించారు. విశ్వనాథ సత్యనారాయణగారి పాండిత్య ప్రతిభలు చాటించే ప్రఖ్యాత విశ్వనాథ సాహిత్యసంచిక ప్రచురించారు. కాళిదాసకృత కుమార సంభవానికి తెలుగు గద్యానువాదం చేశారు. వీరి రచనలు వివిధ పత్రికలలో తరుచు కనిపిస్తూంటాయి.

వీరు 1947 లో తరుణ సాహితీసమితి ఆలమూరులో స్థాపించారు. భీమవరం కాలేజీ భాషాపరిషత్ ప్రస్తుతకార్యదర్శి. సాహిత్య సంస్థలలో పనిచేయాలనే కుతూహలం వీరికి చాల ఉంది.

వీరి అభిరుచులు, నాటకరంగం, జ్యోతిషం, దేశ సంచారము. జీవితలోతుల్లోని సౌందర్యాలు జిజ్ఞాసా దృష్టితో వెలికిచూపించి, భావ సంపదతో మురిపించటం ఉషశ్రీ కలం పోకడగా స్ఫురిస్తుంది.

★

# అంతర్వాణి

గోడమీది గడియారం 'ఠంగున' ఒంటిగంట కొట్టి 'టిక్, టిక్' మంటూ సాగిపోతూన్నది. మేలు సరిగ్గా టైముకే వస్తే రెండుగంటల ముందే రావాలి; పండకొండు గంటలకు రావా ల్సిన మేలు ఒంటిగంట ఐనా రాలేదు. ఇదివరలో ఎంత ఆలస్య మయినా పన్నెండు, పన్నెండున్నరకల్లా వచ్చేసేది; ఈరోజు మాత్రం ఒంటిగంట అయినా కూతకూడా వినబడలేదు. దారిలో యింకా ఆలస్య మయిందేమో! మహాభారంగా నిట్టూర్చిం దా వయస్విని, హేమలత,

ఆవేళ మేలులో వస్తానని 'టెలిగ్రాం' యిచ్చిన భర్త కోసం కన్నులు కాయలుకాచేలా చూస్తూ కూచున్నది. ఆయన వచ్చేవరకూ భోజనం చేయకూడ దనుకొన్నది. పదిహేను రోజు లయి వెళ్ళిన ఆయన - ఈనాడు వస్తూంటే ఎంతో సంబరపడి రెండు కూరలూ, రెండు పిండివంటలూ చేసింది. ఆయనకు ప్రీతి అని నిమ్మకాయరసంలో పచ్చిమిరపకాయలుకూడా ఊర వేసింది, ఆ రాగహృదయిని.

పట్నంనుంచి తనకేమి తీసుకొస్తారో అవన్నీ ఊహించుకో సాగింది. మిలమిల మెరిసే అంచుల చీరలు, నిగనిగలాడే గాజులు, తెల్లటి మల్లెపువ్వులు...యింకాయింకా తనకి బనారసు కాజాలంటే మహాప్రీతి కనక అవీ తెస్తారు. లేసు సూదులు, ఊలు దారాలు - ఒకటేమిటి! అన్నీ తెస్తారు. ఆ ఆలోచన

లలో ఆకలి ఆవలింత అయిపోయింది. గడియారం కొట్టిన అయిదుగంటలు వినపడనేలేదు మనస్వినికి.

ఆ ఆనందానుభూతిలో ఆమె ఏమేమో అల్లుకోసాగింది. ఆయన మొన్ననే వ్రాసినకవరు ప్రకారం నెలకు 150 రూపాయలు ఆదాయం వస్తుంది. ముందుముందు తనుకూడా కష్టపడి మరో నాలుగు హిందీ పత్రికలకు రచనలు పంపుతూంటే మొత్తం రెండువందలూ రావొచ్చు. అంతతోఎంత స్వతంత్రంగా నయినా బ్రతుకవచ్చు, ఒకరిముందు 'దేహి' అని తలవాల్చి అడుగనక్కర్లేదు. వచ్చే సొమ్ముతో యిల్లు ఎంత అందంగా అలంకరించుకోవచ్చు. గుమ్మాలకు, కిటికీలకు పసుపుపచ్చని పువ్వులుకుట్టిన నీలాపతెరలు వేసికోవచ్చు. పందిరి పట్టిమంచం ఒకటి మంచి వడ్రంగిచేత చేయించుకొని, చక్కగా చిక్కగా వార్నీసు పూయించి అందమైన పువ్వులగుడ్డ చాందినీ వేయించుకోవాలి; మంచి బూరుగుదూది పరువు, కాశ్మీరు కంబళ్ళు, ఇంకా రెండునెలలు తిరిగేసరికి, కాస్త ఓపికపట్టితే పక్కింటి సౌభాగ్యలక్ష్మి వేసికొనే "నెక్లెస్" లాంటిది తనూ వేసికోవొచ్చు. అలా అలా ఒక్కొక్కటే నెమ్మది మీద - శంఖాలతావళం, రెండు చిటికిన వ్రేళ్ళకీ ఉంగరాలు......ఆ రాజహంసి ఊహాలు తారాజువ్వల్లా సాగిపోతున్నాయి...

౨

ఒక్కసారిగా ఆమెలో సిగ్గు కలిగింది. నవ్వుకూడా వచ్చినది. "ఎంచక్కా ఒక్క పసిబిడ్డకూడా ఉంటే," ఇదే ఆమెకు

నవ్వునూ, సిగ్గునూ కలిగించింది. ఇదివరలో అయితే ఆమెకు ఈ ఆశఉన్నా భయపడేది. ఇద్దరికి రోజు గడవటమే బ్రహ్మ ప్రళయమవుతూంటే యింకో పొట్టకూడానా! అని ఆవేదనపడేది. కాని ఈసారి ఆమెలో ఉత్సాహం ఉప్పొంగింది. ఆనందం ఆటలు ఆడింది. ఎన్నివున్నా ఒక్క పసిపాప లేకపోతే ఇంటికి శోభ లేదనుకొన్నది. మళ్ళీ శ్రావణమాసంనాటికి తనబిడ్డకు 'బాలసార' పంచిపెట్టాలనుకొంది. చిన్నపాప బుల్లి వ్రేళ్ళకి ఉంగరాలు, మెళ్ళో బంగారుపతకం గొలుసు, ముంజేతికి మురుగులు, చెవులకు వేపకాయలు, కాళ్ళకి బుల్లి మువ్వలగజ్జెలు; సిల్కుగౌను, బుల్లిలాగు, ఉంగరాలజుత్తు శ్రద్ధగా దువ్వి రిబ్బనుతో పింఛంకట్టి చంకనెత్తికొంటే ఎంత సరదాగా ఉంటుంది?

"బాబిగా" అని ముద్దుపెట్టుకునేందుకు ఆయన వస్తారు. నేను వదలను. బాబిగాడు నన్ను గట్టిగా కావలించుకొంటాడు. ఆయనకేసి చూసి బాబిగాడు నవ్వుతాడు, 'మేమే గెలిచా'మని ఆయన బుగ్గపట్టుకుంటూ.

"అమ్మపోలికే, నా దగ్గరి కొస్తాడా? నామాటలు వింటాడా? నీ కొడుకు ప్రధానమంత్రి ఔతాడా ఆర్థిక మంత్రి ఔతాడా?" అని నవ్వుతూ ప్రశ్నిస్తారు.

"అబ్బ చాల్లెద్దురూ!"

అని ఆనందంలో అప్రయత్నంగా పైకే అనేసింది. గుమ్మున ఆగినవి కమ్మని గాథలు. నాలుక కరుచుకొన్నది; నవ్వుకొన్నది; ప్రేమ తపస్విని, హేమలత.

3

గడియారం ఆరుగంటలు కొట్టి యథారీతి టక్ టిక్ మంటూ పోతూన్నది.

ఆయనమాత్రం రాలేదు; వచ్చి హాస్యానికి పక్కప్రక్కనన్నా దాక్కున్నారేమో. అహఁ...అలా చేయరు. వస్తూనే అలా యెందుకు చేస్తారూ? అసలాయనకు వస్తానన్న రోజుకి వచ్చే అలవాటు లేదు; లేకపోయినా వస్తున్నానని నిన్ననేగా టెలిగ్రాం యిచ్చారూ! అంచేత వచ్చేస్తారు.

ఇలా అనుకుంటూనే లేచి రాజహంసిలా అడుగులు వేసికొంటూ వచ్చి వీధి గుమ్మంలో నిలబడింది; ఒయ్యారంగా హేమలత.

మామూలుగా జనం సాగిపోతున్నారు.

బళ్ళూ...కార్లూ...రిక్షాలూ...సైకిళ్ళూ...

అంతకన్న రోజూచూచే ఊళ్ళో ఏం విశేషం కనపడుతుందీ.

నెమ్మదిగా వచ్చే, పోయే జనం సన్నగిల్లుతున్నది.

అంతలో స్పష్టాస్పష్టంగా రైలుకూత వినబడింది.

బహుశః ఇదే "మేల్" అయి ఉంటుంది, అనుకొన్నది హేమలత.

బళ్ళూ, రిక్షాలూ ఎక్కువగా రాసాగాయి.

వచ్చే ప్రతిబండివైపూ; ప్రతిరిక్షా వైపూ ఆశగా చూసేది అనురాగ తరంగిత హృదయంతో హేమలత.

ఏ ఒక్కబండీ తన గుమ్మంముందు ఆగలేదు.

నెమ్మదిగా సద్దు మణుగుతూన్నది.

అయినా ఆమె హృదయంలో ఆశ పెరుగుతూనే ఉన్నది.

నిలబడి, నిరీక్షిస్తున్నది, ఆ ప్రోషితభర్తృక హేమలత.

"మరేనండీ, తెనాలి వయినే బోల్తాకొట్టింది మెయిల్...

దానితో పాసింజరువరకూ ఆగాల్సివచ్చి ఆలస్యమయింది.

పాపం! ఆరుపెట్టెలు చూర్ణమైపోయాయి..."

అనుకొంటూ పోతూన్న ప్రయాణీకుని మాటలు హేమలత లేత హృదయంలో గుండుసూదుల్లా గురగుర లాడినవి. ఆమె మృదుల హృదయంలో గులాబీ ముళ్ళల్లా గ్రుచ్చుకొన్నవి.

ఆశాపూర్ణ నేత్రాలతో ప్రకాశించే ఆమె వదనంలోని స్మితశ్రీరేఖలు జారిపోయినవి.

కన్నుల నీరు కమ్మింది—

కాళ్ళు గజగజలాడినవి-

గుండె దడదడలాడినది-

నిలువునా నీరయి గడపమీదికి జారిపోయింది.

"మెయిల్ పల్టీ—అయిదారు పెట్టెలు చూర్ణం..."

ఆమె చెవుల్లోంచి రింగునమ్రోగి, రివ్వున శూలాల్లా దూసుకుని గుండెకు తూట్లు కొడుతున్నవి.

ఆ శబ్దాలు హేమలత హృదయాన్ని మెలిద్రిప్పేస్తున్నవి.

శరీరం చల్లబడిపోయిన ట్లనిపించింది.

అయినా ఆయన ఈ మెయిల్ కి బయల్దేరకపోతే ఎంత బావుండును?

దారిలో ఏ స్నేహితులయినా అడ్డుపడి ఈ ఒక్కపూటకూ ఆపుచేస్తే......

అంతకన్న హేమలత స్త్రీ హృదయం ఆశించేదేముంది? ఆ మెయిలులో యింకా ఎన్నివందల ప్రాణులుంటాయో... అయితేనేం తన మంగళసూత్రాలు...అంతే! ఈ భారత దేశపు స్త్రీకి ముఖ్యం...

ఒకసారి మంగళసూత్రాలు పైకితీసి కన్నుల కద్దుకుని పైటలోకి వేసుకుంది.

వెనక రైలుప్రమాదం జరిగినప్పుడుకూడా ఆయన స్టేషను కొచ్చి ఎక్కబోతుండగా - పాపం! - ప్రకాశంగారట, ఆయన వచ్చి బలవంతంగా యింటికి తీసికెళ్ళారు. ఆయనే తనపాలిట దేవుడల్లే అనిపించింది.

ఈ సారికూడా అలా జరక్కూడదూ...

అనుకున్నప్పుడూ అన్నీ అలా జరుగుతయ్యా...

అదీకాక వస్తున్నానని టెలిగ్రాం యిచ్చేశాక యింక ఆగుతారా!

ఈ ఊహ వచ్చేసరికి హేమలత పెదవులు గజగజ లాడి పోయినవి.

గులాబీ రేకుల్లాంటి బుగ్గలు జివజివ లాడిపోయాయి.

గుండె మందగించిన ట్లనిపించింది.

గొంతుతడి యారిపోయింది-

కళ్ళు మూతలు పడుతున్నాయి-
శరీరం కంపించి పోతున్నది-
మనస్సు వ్యాకులమై పోతోంది...
పోనీ...ఆఖరు పెట్టిలో యెక్కితే...
హమ్మో...ఒక్కసారిగా గుండె తేలికపడింది.

పెదవుల్లో నవ్వు...బుగల్లో సొట్టలు...అర్ధ్రనేత్రాల్లో కాంతులు ..

హేమలత మనసులోని ఊహాలకే భౌతిక పరిణామా లేర్పడుతున్నవి.

ఆయన కలగన్నారా బండిబోల్తా అవుతుందని...

ఆలోచించేకొద్దీ భయం అధికమతున్నదే కాని మనస్సుకి శాంతి దొరకటం లేదు.

అలానే కూచుని చాల సేపు ఆశాసౌధం నిర్మించుకొన్నది. ఒక్క ఊహతో సౌధం పునాదుల్లోకి కూలిపోతున్నది.

దేవుడనేవాడే లేడనిపించిందా అమాయికకు.

వాడే ఉంటే - నవనవలాడే సంసారాన్ని - యిలా కూల్చేస్తాడా!

రాగహృదయాలలో రక్తపాతాలు సాగిస్తాడా?

* * *

ఇల్లంతా అంధకారం అలముకొన్నది.

ఆమె కన్నులలో దృష్టి మందగించింది.

ఏదో భయంకర శక్తి వికటాట్టహాసంచేస్తూ, వికృత హాస్తంతో గుండెను పిండుతూన్నట్టనిపించింది. ఆమె మన

స్సులో కొన్ని రైలు ఇంజెన్లు 'ఢీ' కొట్టినట్లు - ఆమె మెడ మీదనుండి అయిదారు మెయిల్ బళ్ళు పరుగెత్తినట్లూ అనిపించింది.

అతి ప్రయత్నంమీద - వణకుతూన్న కాళ్లతో పట్టుపట్టి లేచి, తలుపువేసుకొని - వెక్కి వెక్కి చంటిపిల్లలా యేడుస్తూ వచ్చి గదిలో మంచంమీద వాలిపోయి తలగడాలో తలదూర్చేసింది.

ఏ ప్రొద్దుకో నీరసరంగా నిద్రపట్టింది.

నిద్రలోకూడా ఏడుపు తగ్గలేదు.

పద్ధెనిమిది వసంతాల యౌవనం మొగ్గతొడుగుతూండగా కాపురానికి వచ్చి రెండు శరత్తులను అనుభవించిన అమ్మాయి ఆ సమయంలో ఏడవటం కంటె ఏం చేయగలదు!

ఏవో రైళ్ళు వస్తున్నవి - పోతున్నవి. ఎందరో దిగుతున్నారు, వెళ్ళుతున్నారు. కానీ...ఆయన జాడలేదు. అంతలో రెండు రైళ్ళు ఢీకొని పట్టాలు తప్పిపోయినవి. ఎందరో పిప్పి పిప్పి అయిపోయినారు; కొన్ని చేతులు, కొన్ని కాళ్ళు కొన్ని మొండాలు, కొన్ని శిరస్సులు...అబ్బబ్బ...భారత రణరంగంలో పద్మవ్యూహంనాటి ఘట్టంలా ఉన్నది. రక్తం ఏకోన్ముఖంగా ఎర్రగా ప్రవహిస్తున్నది.

భయపడి కెవ్వున కేకేసి లేచింది; కళ్లు నులుముకు చూచింది;

తనగదిలో మంచంమీద తాను...అంతాకల...

ఇంటిలోని చీకటి ఆమెను భయపెట్ట సాగింది. కళ్ళు మూసుకుని తలగడాలో తలయిరికించేసి గజగజలాడిపోతూ

పడుకొన్నది. కన్నీటితో తడిసి ముద్దయి పోయింది, తలగడ; నును సొట్టబుగ్గలు కందిపోయినవి; ముఖం పాలిపోతున్నది. యౌవన వసంత రేఖలు రేఖామాత్రంగానయినా హేమలత వదనంమీద గోచరించటం లేదు.

గడియారం ఎనిమిదిగంటలు కొట్టి టక్ టిక్ మంటూ సాగిపోతూన్నది. కిటికీలోంచి వెచ్చవెచ్చగా వస్తూన్నవి సూర్య కిరణాలు. హేమలతకు లేవలేనంత బద్ధకంగా ఉంది; ఎవరో కర్రలతో బాదినట్లు, ఒళ్ళంతా హూనం చేసినట్లు నొప్పులుగా ఉంది. తల తిరుగుతోంది... వికారం... నీరసం... లేవడాని కేమీ సత్తువ కనిపించటంలేదు.

నోరంతా వెగటుగా ఉంది. తల దిమ్ము...వికారం...

ఉమ్ములు వస్తున్నవి...

కడుపులో కలచి వేస్తూన్నది.

అలానే ఓపికపట్టి లేచి గోడ ఆసరాతో వీధిగుమ్మం తలుపు తీసి చూసింది.

బళ్ళూ, కార్లూ వస్తూ పోతున్నవి.

జనం మామూలుగా నడిచిపోతున్నారు.

ఇంతమందిలో ఆమె హృదయావేదనను అడిగి తెలిసి కొనేవారు లేకపోవటంతో ఆమెకు బాధ మరీ యెక్కువయింది.

పిచ్చిపిల్ల హేమలత...

హేమలత పిచ్చిపిల్ల కాకపోతే ఆ నగరవీధిలో పోయే జనానికి ఆమె కష్ట - సుఖాలతో ఏం సంబంధం? అని ఆలో చించుకోలేక పోయేదా...

అలానే కొన్ని క్షణాలు నిలబడింది.

అంతకంతకు వికారం ఎక్కువయి తల త్రిప్పి, కడుపు నులిమేస్తున్నది. వాంతివచ్చే ట్టనిపించింది.

నెమ్మదిగా లోపలకు నడిచి, తలుపు గడీవేసి, వాలు కుర్చీలో నడుం వాల్చింది.

అంతలో ఒక వాంతి-

ఆమెకు భయం వేసింది.

ఈ స్థితిలో 'నా' అనే వారెవరూ దగ్గరలో లేరు.

ఎందుకూ...ఉంటే...

ఆయన లేనప్పుడు...అనుకోకుండా ఆమె చేతులు మంగళసూత్రాల మీదికి నడిచినవి.

ఆ పవిత్ర మాంగళ్యం ఆమె కన్నులలో ఒక ఆశారేఖను మెరిపించింది.

హేమలతకు ఒక్కసారి ఏడవాలనిపించింది.

అందుకుకూడా ఓపిక లేకపోయింది.

నెమ్మదిగా మూలుగుతున్నది.

వీధితలుపు ఎవరో తడుతూన్న ట్టనిపించి, లేవబోయింది. నీరస, వికారాలు లేవనీయలేదు.

రెండుక్షణాలు ప్రయత్నించి కుడిచేత్తో గోడ ఆసరా చేసుకొని, ఎడమచేత్తో ముఖంమీదిజుట్టు సరిజేసుకుంటూ, తడబడే అడుగులతో వెళ్ళి గడీ తీసింది.

"ఛాన్లే, ఇదంతా ఏమిటే...ఇంటినిండానూ...ఇప్పుడే డా. సౌభాగ్యలక్ష్మి వచ్చి ఏమన్నదో తెలుసా...పాపాయి పుడతాట్ట"

ఆమె బుగ్గపై పెదవి ఉంచుతూ అన్నాడు హేమలత వదనం రాగరంజిత మయింది.



# నవ్య సాహితీ సమితి, హైదరాబాదు

## సమితి కార్యవర్గము

అధ్యక్షుడు :

కురుగంటి సీతారామయ్య

ఉపాధ్యక్షులు :

కాలనాథభట్ట వీరభద్రశాస్త్రి

వేమరాజు నరసింహారావు

కార్యదర్శులు :

పోతుకూచి సాంబశివరావు

ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

సమితి పత్రిక సంపాదకుడు :

జయంతి సత్యప్రభు

కోశాధికారి :

వేమూరి సుబ్బరామశర్మ

*   *   *

## సాహిత్య ఉపసంఘం

జయంతి సత్యప్రభు, అధ్యక్షుడు

ఎ. ఆర్. కృష్ణ

ఇసుకపల్లి దక్షిణామూర్తి

జి. సురమౌళి

ఎ. వి. రాధాకృష్ణ

## ఆర్థిక ఉపసంఘం

వేమూరి సుబ్బరామశర్మ, అధ్యక్షుడు

కురుగంటి కృష్ణమూర్తి

కే. వెంకటరామారావు, ఎం. ఎల్. ఏ.

టి. లింగమూర్తి

జి. వి. ఆర్. కనకం

కార్యాలయకార్యదర్శి

గరిమెళ్ళ రామమూర్తి

*